# మీరూ సంస్కృతం నేర్చుకోండి



శ్లో॥ సరస్వతి! నమస్తుభ్యం వరదే కామరూపిణి!
విద్యారంభం కరిష్యామి సిద్ధిర్భవతు మే సదా!!


రచయిత

"సాహిత్యవిద్యాప్రవీణ" "భాషాప్రవీణ" "జ్యోతిషకోవిద"

**నిషల [illegible]**

M. A (తెలుగు); M. A (సంస్కృతం-అలంకార)

M. A (సం-వ్యాకరణం) M. A (సం-దర్శనాలు)

ప్రథమ ముద్రణ
అగష్టు - 1992

ప్రతులు : 1000

వెల. రూ. **12**/-



ప్రతులకు : యస్. శ్రీసత్యవల్లీ దేవి
D/O రచయిత
యస్. బి. యస్. యస్. కళాశాల
పొన్నూరు - 522 124
గుంటూరు జిల్లా.

ముద్రణ :
వినోద ప్రింటర్స్, పొన్నూరు.

# అంకితము



సంస్కృతాంధ్రభాషాకోవిదులు, మత్ప్రపన్న శ్రీరామకథామృతాది సంస్కృతాంధ్ర మహాకావ్యనిర్మాతలు, నైష్ఠికాగ్రేసరులు-మహోపాసకులు ఋషితుల్యులునైన బ్రహ్మశ్రీ తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రిగారికి భక్తితో సమర్పితము.

# తొలి పలుకు

సాహితీ పరిజ్ఞానానికి సంస్కారానికి భాషయెంతగానో ఉపయోగ పడుతుంది. ప్రపంచంలో అనేక సుందరభాషలలో సంస్కృతం ఒకటి. ఇదిచాలాకష్టమనీ చాలామంది భావిస్తారు ఇదినిజంకాదు. కావ్యభాషలో కొంతకాఠిన్యం ఉన్నా స్వల్పకాలంలో సరళమైన భాషలో మనభావాలను వ్యక్తంచేసుకోవచ్చు. పురాణాలన్నీ యీ సరళభాషలోనే వ్రాయ బడ్డాయి మనం సంస్కృతంలో మాట్లాడడానికి కొద్దివ్యాకరణ పరిజ్ఞానం, పదాలు తెలిస్తేచాలు. ఇందుకు ఎటువంటి వారికైనా మూడునెలల వ్యవధి చాలు.

మూడునెలలు జాగ్రత్తగా యీ రీడర్లను అధ్యయనం చేయండి. ఆంగ్లభాషలో పరిజ్ఞానం ఉండి ఆఫీసులలో పనిచేసే వారికి త్వరగా సంస్కృతం రావడానికై యీ పుస్తకాలుద్దేశింపబడ్డాయి వారికి త్వరగా రావాలనే సంస్కృతపదాలకు ఆంగ్లభాషలోని పదాలివ్వబడ్డాయి. అన్నం, పప్పు, కంద, బచ్చలి మొ॥ సాధారణ పదాలకు ఆంగ్లంలో కంటే తెలుగులోనే అర్థం తేలికగాఉంటుందని అలా ఇవ్వబడ్డాయి. సందర్భానుసారంగా ఆంగ్ల, ఆంధ్రభాషాపదాలతో వివరణలు చేసాను.

వ్యావహారికపదాలకు సంస్కృతపదాలనిచ్చే సమయంలోకొందరు ప్రచారకులు క్రొత్తపదాలను సృష్టిస్తున్నారు. ఇలాంటి సమయంలో యీ క్రిందిఅంశాలు గుర్తించాలి. నేడు మనం చూసే వస్తువులకు సమానమైన సంస్కృతపదాలు వృక్షశాస్త్రం, ఆయుర్వేద, పురాణాది గ్రంథాలలో ఉన్నాయి. వాటినే వెలికి తేవాలిగాని క్రొత్తపదాలను

కూర్చరాదు. ఇందుకు సంస్కృతాంధ్రాంగ్ల నిఘంటువులు ఉపయోగ పడతాయి. ఇంగ్లీషులోని పదాలకు ఆప్టే వంటివారు సరియయిన పదాలను చాలావరకు సూచించారు. అవన్నీ పరిశీలించాలి. గోంగూరకు కోశః అనేపదం వాడడం సబబుకాదు. కచూవరః అనేపదం సర్వార్థశబ్ద సంబోధినిలో ఉంది. అలాగే వడియాన్ని భర్జః అనడం కన్న వటకః అనడం ఉచితం. భర్జశబ్దం కంటే వటకశబ్దం కావ్యాలలో ప్రయోగింపబడింది. ఒక పదానికి తప్పనిసరిగా సంస్కృతపదాన్ని సృష్టించవలసి వస్తే ధాతుప్రత్యయయుక్తంగానే వాడాలి. ఆంగ్లంలో ప్రసిద్ధిచెంది నిఘంటువులలో లేనపుడు ఆంగ్లపదాన్ని యథాతథంగా గ్రహించడం తప్పుకాదు. అనేక భాషలకు తననుండి అనేకపదాల నిచ్చిన సంస్కృతం ఇతరభాషలనుండి పదాలను గ్రహిస్తే దోషంలేదు. కంబాల, ఈసరాఫ, ధురుధరా, కేమద్రుమ మొదలగు పదాలు యవనభాషలనుండి యథాతథంగా జ్యోతిశ్శాస్త్ర గ్రంథాలలో కర్తలచే ఏనాడో వాడబడ్డాయి. హోటల్ మొ॥ పదాలు చాలాకాలం క్రిందటనే ప్రహసనాలలో వాడబడ్డాయి సంస్కృతంలోకి ఇతర భాషలనుండి పదాన్ని యథాతథంగా గ్రహించవలసి వస్తే ప్రాంతీయభాషనుండి కాక ఇంగ్లీషులోని పదాన్ని గ్రహించడమే శ్రేయస్కరం, ఎందుకంటే అది International language అవడంవలన సంస్కృతంలో ఆపదాన్ని విన్నా అందరికీ తెలుస్తుంది. అంతేగాని ఎవరి ప్రాంతీయభాషలోని పదాన్ని వారు చేర్చరాదు, ఉదాహరణకు బంగాళాదుంపలకు potato పదాన్నే గ్రహించాలిగాని ఆలుకమ్ అని వాడనవసరంలేదు. అది అంతర్జాతీయభాషలోని పదం కాకపోవడమే కారణం. ఈరీడర్లలో సాధ్యమైనంతవరకు పై అంశాలను పాటిస్తూనే పదాలను దహరిస్తున్నాను. విద్యార్థులకు ఆంగ్ల



పాఠాలన్ని సందర్భంలో ఉపాధ్యాయులు తెలుగు అర్థాన్ని కూడా చెప్పాలని కోరుచున్నాను. ఇంగ్లీషుపదాలను సంస్కృతంలో వాడితే విభక్తిచేర్చడం ఎలా? అనే ప్రశ్న ఉదయిస్తుంది 'న కేవలం ప్రకృతిః ప్రయోక్తవ్యానాపి ప్రత్యయః' అని విభక్తిలేనిదే వాడరాదు. విభక్తి లేకుండా స్టేషన్ గచ్ఛతి అనడంతప్పు. చివరమార్చి విభక్తిచేర్చాలి అని నా అభిప్రాయం ఇటువంటి సమస్యవస్తుందని ప్రాచీనులకేనాడో తెలుసు అందుకే 'అధికొండవీడు రిపవోనిపాతితాః' 'తానగ్రహీత్ కొండవీడాత్' అనేవి సాధించారు. ప్రహసనాల్లో ఇంగ్లీషుపదాలకు విభక్తులున్నాయి. నన్నయ అహోబలుల అభిప్రాయమే నాది శ్రద్ధతో ఈరీడర్లను అధ్యయనం చెయ్యడం వలన సంస్కృతభాషవస్తుందని నా భావన. ఈభావాన్ని సఫలంచేస్తారుకదూ! నవభారతకావ్య సందర్భంగా శ్రీ నారపరాజు శ్రీధరరావుగారు తెలిపిన అభినందన యిందులో చేర్చాను సాహితీవేత్త, వ్యాకరణపండితులు యోగసంగ్రహ నిర్మాతలైన వారికి నా కృతజ్ఞతలు. అందముగా ముద్రించి యిచ్చిన వినోద ప్రింటర్స్ వారికి నా హార్దిక కృతజ్ఞతలు.

భాషాభివృద్ధికై చేసే యీ చిన్నిప్రయత్నాన్ని ఆదరిస్తారని ఆశిస్తూ—

నీ

రచయిత



# పదార్చనా

బ్రహ్మశ్రీ నిష్ఠల సుబ్రహ్మణ్యసుధీః ! సంస్కృతాంధ్రజ్యోతిష విద్యాపారంగత ! స్వర్ణపురీ సంస్కృత కళాశాలాధ్యాపక !

భవత్కవితామకరంద సమాస్వాదన కుతూహలాదాగతాస్మి. సరస్వతీప్రాంగణే భవద్రుచిర కవితామంజుల విన్యాసః సర్వజనామోద ముద్రాం ప్రాప్స్యతి. ఆంధ్రభాషాయాః శైలీమృదుమధురపద ప్రకర్షైః పాఠకలోకమాకర్షయతి.

నిష్ఠలాన్వయ కలశపాథోధిచంద్ర ! సత్కవీంద్ర !
మమ వినయపూర్వక నమస్కార మందార కుసుమమాలాం
భవత్పదాబ్జసమీపే స్థాపయితుమనుగృహాణ.

శతవత్సరమాయుష్యమ్
ఆరోగ్యంచాపి సంపదః
భగవాన్ శేషశైలాద్రిః
దేవో తుభ్యం దదాతు వై.

ఇతి

స్వర్ణపురీ
31-12-1989

సంస్కృత విద్యార్థినీ
చావలి సుధారాణీ

# యువనీరాజనమ్

(నవభారత కావ్యసందర్భమున ఒసగబడినది)

1 నవభారతమ్మను పేర నెవ్వరు
నవ్యకావ్య సుగంధ మిచ్చిరో
నిష్ఠలాన్వయసూరి మణి యగు
వారికీర్తింతున్.

2 భారతావని పేరు కొన్నా
మంచి చెడుగుల మాలకూర్చి
హృదయవాసన మేళవించి
కవితలో చెప్పెన్.

3. చెడుగులను కంటకంబుల
కలుపు మొక్కల తీయబూనిన
కవికృషీవలు నిష్ఠజూచిన
హృదయమే పొంగున్.

4 లోకముల శాసించు తల్లికి
కవికుమారుడు మొఱపెట్టుట
సాజమై కవిలోకమునకున్
గానిపించునుగా.

5. పాపమతులను చక్కదిద్దగ
కరడుగట్టిన దుండగీండ్లకు
బుద్ధిచెప్పగ, లోకమాతకె
తగునని తలంచెన్.

6. దొడ్డిదారిన ధర్మమేగెను
సత్యమంతర్ధానమొందెను
స్వార్థచింతకు మానవుండొక
బానిసగ తానాయెన్.

7. కవి వచించిన సత్యపథమున
పయనమైనా లోకమెల్ల
స్వర్గసీమగ మారకున్నె ?
దూరుపోకున్నె ?

8. నిష్కలాన్వయ రత్నమీయన
వెలుగులను వెలయించకున్నె ?
సుబ్రహ్మణ్యాఖ్యుఁడీయన
మంచి తా పంచకున్నె ?

9 ఇట్టి ఋషికోయువకులారా !
హృదయ పద్మములప్పనంబుగ
ఒసగి ఈ మహనీయు దీవన
అందుకొనరండీ !

సంస్కృతాంధ్ర గ్రంథ కర్త
డా. నారపరాజు శ్రీధరరావుగారు
బొమ్మూరు. 16-11-90

# మీరూ సంస్కృతం నేర్చుకోండి-1

## సంస్కృతభాషా ప్రాశస్త్యము

## సంస్కృతం అంటే ఏమిటి?

భారతీయ భాషలనెన్నిటినో సుసంపన్నముగా నొనర్చినదీ భాష. దీనికే గైర్వాణియని మరియొక పేరు. గీర్వాణులనగా దేవతలు. వారి భాష గావున నిది గైర్వాణి అయినది. ఎవరిమాట అమోఘముగా పని చేయునో వారు దేవతలు. వారి భాష గావుననే ఇది దేవభాష. ఇట్టి ఘనత ప్రపంచ మందలి భాషలలో సంస్కృతమునకు దక్కినది. సంస్కృతము దేవవాక్కు యని ఋషులు చెప్పిరి. భారతదేశమునకు సంస్కృత భాష, సంస్కృతి ప్రతిష్ఠను ఆపాదించుచున్నవని తెలియుచున్నది.

సంస్కృతభాషను సంస్కరింపబడిన భాషయనియందురు. అనగా ఇండోజర్మానిక్ భాషనుండి విడివడిన భాష మూలప్రాకృతమనియు అది సంస్కరింపబడి సంస్కృతమైనదనియు కొందరందురు. ఇట్టి సంస్కృతము నుండియే స్త్రీలకు సులభముగనుండు శౌరసేని, పైశాచి, మాగధి మొదలగు ప్రాకృత భాషలేర్పడినవి. కొందరు ప్రాకృతము సంస్కృతమునకు మూలమనుట పొసగదని, సంస్కృతమే ప్రథమ గ్రంథమగు ఋగ్వేదమున గోచరించుచున్నదని చెప్పుదురు. సంస్కృతము పలుకుట కశక్యమై అపభ్రంశమై ప్రాకృతమైనదని,

వాక్యపదీయము చెప్పుచున్నది. భరతముని గూడ నిట్లే చెప్పెను. ఈ వాదాలతో ప్రస్తుతం మనకు పనిలేదు.

సంస్కృతభాషలో వేదాలు, పదునెనిమిది పురాణాలు శాస్త్రములు వేదాంగాలు షడ్దర్శనములు, కావ్యములు, నాటకములు, మొదలగు అనేక విషయముల గ్రంథములెన్నియో గలవు. ప్రపంచమందలి మొట్ట మొదటి గ్రంథములు వేదములు అవి సంస్కృతభాషలోనే ఉన్నాయి.

సంస్కృత భాషలో ఒక పదమునకు వచ్చు అర్థము వేరొక పదముచే చెప్పుట కవకాశములేదు. ఏ పదము అర్థము ఆ పదముదే. ఇట్టి అర్థభేదములను పాటింపకయే ప్రతి పదార్థమును చెప్పుచుందుము. సంస్కృతమునందలి పదములకు ఇతర భాషలలో అర్థమును వివరించుకొనవలయును అంతేగాని ఆ భాషతో పదాల్ని చెబితే ఈ అర్థంరాదు ఉదాహరణకు పత్నీ అన్నాం అనుకొందాం. దీని అర్థాన్ని ఆంగ్లంలో గాని, తెలుగులోగాని వివరించుకోవచ్చు. పురుషుడు చేసే ధార్మిక కార్యక్రమాలలో తనవంతు నెరవేరుస్తూ సాఫల్యాన్ని కూర్చే జీవిత భాగస్వామిని అని అర్థం. ఈ అర్థం వివరిస్తే వస్తుంది కాని Wife, Better half పెండ్లాము, ఆలు అంటే రాదు కదా. ఇది విశేషము.

ఇతరభాషలో చిన్న చిన్న భేదాలతో ఎన్ని పదాలు సుమారు ఒకేఅర్థంలో ప్రయోగింపబడుతాయో అన్నిరకాల పదాలు సంస్కృతంలో ఉన్నాయి. ఉదాహరణకు లోభి అనే సుమారు అర్థంలో Peevish అంటారు. దీనికి పిశునః. Miser అంటే కృపణః అనవచ్చు. Avaracious అంటేగృధ్నుః అంటారు. Niggardly fellow అంటే మితంపచః అంటారు ఇలా ఇతర భాషలతో సరితూగే పదజాలంఉంది అంతేగాక ఏ భాషలో పదాలకైనా అంతువుంటుంది. ప్రతి భాషకి ఇన్ని



పదాలని భాషావేత్తలు లెక్కగట్టియుంచారు. కాని సంస్కృతానికి ఎవరూ లెక్కగట్టలేదు. ఇందుకే యిది దేవభాష.

Physics, Chemistry మొదలగు విషయాలను ఆంగ్లంలో నుండి తెలుగు మొదలగు దేశభాషలలోకి అనువదించేటప్పుడు తప్పని సరిగా సంస్కృత పదాలను వాడాలి. అవి లేకుండా అనువాదం జరుగదు. ఉదాహరణకు సజలసల్ఫ్యూరి కామ్లము, హిమీకరణ మిశ్రమము మొదలైనవి తీసుకొనవచ్చు. టెలివిజన్, మొదలైన సాధనాలలోని భాగాలకు గూడ పారిభాషిక పదాలను కూర్చుకొనేశక్తి యీ భాషకుంది.

## సంస్కృతం చరిత్ర ఏమిటి?

క్రీస్తుశకం 1వ శతాబ్దంలో బర్మాదేశంలో సంస్కృతం ప్రచారంలో ఉంది అనే విషయం సంస్కృత గ్రంథసూచిక వలన తెలుస్తూంది. సంస్కృతం ప్రచారంలో ఉండబట్టే శాసనాలు ఈ భాషలో వ్రాయబడినవి. నాల్గవశతాబ్దంనాటి సంస్కృతశాసనం పెటాబన్‌వద్ద గల మంగ్‌సిటీవ్‌వద్ద దొరికింది. ఆక్స్‌ఫర్డ్‌వారు వెలువరించిన నిఘంటువు ఇండోయూరోపియన్ భాషలలో సంస్కృతం బాగా ప్రాచీనమైందని చెబుతూంది. క్రీ. పూ. 700 లకు ముందు సంస్కృతంలోనే అన్ని వ్యవహారాలు జరిగాయి. చంపానగరంవద్ద జరిగిన త్రవ్వకాలలో గూడ ఆనాటి వ్యవహారభాష అయిన సంస్కృతంలోని వంద శాసనాలు బయటపడ్డాయి. అశోకుని కాలంవరకు గూడా సంస్కృతంలో ప్రజలు మాట్లాడారు. తరువాత క్రమంగా సంస్కృతంలోని కొన్ని పదాలు మారి పాళీభాషయై వాడుక భాష అయినది.

క్రీ. శ. 1, 2 శతాబ్దాలలో సంస్కృతమే రాజభాష. గుప్తుల కాలం నుండి 300 సంవత్సరాలవరకు సంస్కృతమే వ్యవహారభాష.

ఇది వ్యవహారంలో ఉన్నదని మాక్స్‌ముల్లర్, గజనీమహమూద్‌తో ఇండియాకు వచ్చిన ప్రఖ్యాత ఖగోళశాస్త్రజ్ఞుడైన అల్‌బెరూని ఇండియాలో సంస్కృతంలో వ్యవహారాలు సాగేవని సాక్ష్యం ఇస్తున్నారు కాశ్మీర్ నుండి సంస్కృతం, భూటాన్, చైనా మొదలగు ప్రాంతాలకు వ్యాపించినదని రాజతరంగిణి గ్రంథం చెబుతుంది. చీనా యాత్రికుడైన ఇత్సింగ్ కూడా ఈ విషయాన్ని అంగీకరించెను. శివాజీ కాలంలో సంస్కృత వ్యవహారాలకై రాజ్య వ్యవహారకోశాన్ని రఘునాథుడు రచించెను.

మొగలు చక్రవర్తులు గూడ సంస్కృతాన్ని ఆదరించి పెంపొందించారు. సంస్కృత శ్లోకాలలోనే వారి చరిత్రలు వ్రాయించుకున్నారు. షాజహానుకు సంస్కృతం తెలుసు. అందుకే పండితరాజు బిరుదాన్నిచ్చి జగన్నాథుడిని సత్కరించాడు. రవీంద్రనాథటాగూరు సంస్కృతంలోని శాకుంతలాది గ్రంథాలచే ప్రభావితుడై రచనలుచేసి నోబెల్ బహుమతిని పొందగలిగాడు సంస్కృతంలో చారిత్రక గ్రంథాలవలననే ఆనాటి రాజకీయ స్థితులు తెలుస్తున్నాయి.

క్రీ. శ. 1676 వ సంవత్సరంలో Sir William Jones అను పండితుడు సంస్కృతభాషా సౌందర్యం చూచి లాటిను, గ్రీకు భాషల కంటె సంస్కృతంలోనే గొప్ప సౌందర్యం ఉందని చెప్పాడు. భాషా శాస్త్రపండితులైన Burrow, Tucker Von Scheiegal, Max Muller మొదలైన ఎందరో ఇతర దేశస్థులు సంస్కృతంలో చాలా గొప్ప కృషి చేశారు.

క్రీ. పూ. 6వ శతాబ్దంలోని యాస్కముని నిరుక్తమనే గ్రంథాన్ని రచించాడు..ఇతడు సంస్కృతంలోని ఒక్కొక్కపదాన్ని



ఒక్కొక్క ప్రాంతంలో ఎలా వాడుతున్నారో వివరించాడు. ఈ లక్ష్యాల వలన గూడా సంస్కృతం వ్యవహారంలో ఉన్నట్లు తెలుస్తుంది. పాణిని ముని తన వ్యాకరణంలో దూరంగా ఉండేవారిని పిలిచేటప్పుడు ప్లుత స్వరం పలకాలని చెబుతున్నాడు. సంస్కృతం వ్యవహారభాషే అనడానికి యిదికూడా కారణమే. 'దండాదండి (కర్రలతో తన్నుకుంటున్నారు). ఉదరపూరం భుంక్తే (పొట్టనిండా తింటున్నాడు) మొదలైనవన్నీ వ్యవహారాన్ని సూచిస్తున్నాయి.

పాణిని తరువాత వచ్చిన వరరుచి, పతంజలి గైర్వాణిలో లోకంలో వాడబడే క్రొత్త పదాలనుగూడా చేర్చుకుంటూ, సాధిస్తూ వచ్చారు. ఇందువలన భాష పెరుగుతూ వస్తుందని తెలుస్తుంది. భగవంతుడైన పతంజలిముని ఒకానొక పండితునికి, బండితోలేవానికి జరిగిన సంభాషణను తెలియజేసాడు. సామాన్యప్రజానీకానికి గూడా గైర్వాణి అర్థమవుతూ ఉండేదని తెలుస్తుంది. భోజరాజు, విక్రమాదిత్యుల కాలంలో గైర్వాణి తెలుగులాగా సాగింది.

తెలుగు మళయాళం మొదలైన భాషల్లో మాండలిక భేదాలున్నాయి. శ్రీకాకుళం, విశాఖజిల్లాలలో మేడి అని పిలువబడేది, రాయలసీమలో మేడితోకయని, తెలంగాణాలో పాలెయని ఇతర కోస్తాలలో మేడియని పిలువబడుతుంది. ఇలాగే ఆనపకాయ, అనింగెకాయ, సొరకాయ భేదాలు. ఇవి మాండలిక భేదాలు. ఇలాంటి మాండలిక భేదాలు గైర్వాణిలో లేవు ఎవరు మాట్లాడినా ఒకేభాష అవడంవల్ల అందరికీ అర్థమవుతుంది.

## సంస్కృతం అందరికీ వస్తుందా?

కొంతమంది ఇలా ప్రశ్నించవచ్చు. నిరాక్షేపంగా ఎవరికైనా జాతి మత కుల వివాదాలకు దూరంగా నేర్చుకుంటే సులభంగానే వస్తుంది. అక్బర్, షాజహాన్ ఇంకా అనేక మంది ముస్లిములకు గైర్వాణి తెలుసు. గైర్వాణిలో పండితులై గ్రంథాలను రచించిన ముస్లిములు ఎందరో ఉన్నారు. అన్ని దేశాల్లోను గైర్వాణి తెలిసిన వారున్నారు.

ఔరంగజేబు తరువాత వచ్చిన అబ్దుల్లామహమ్మద్‌ను వర్ణిస్తూ అబ్దుల్లా చరితమ్ అనే కావ్యాన్ని లక్ష్మీపతియనే కవి వ్రాసాడు. అక్బర్, శ్రీహరి యనే విద్వాంసుడిని ఆస్థానంలో నియమించుకున్నాడు. జగన్నాథుడు ఆసఫ్‌ఖాన్‌ను వర్ణించాడు. మణుహ, తంబీర, అపోక్లిమ మొదలైన అన్యభాషాపదాలు గైర్వాణిలోకి చేరడంవలన గైర్వాణీ రచయితలకు, ఇతర భాషావేత్తలకు గల సన్నిహిత సంబంధం అవగతమవుతూంది. ముస్లిములు, క్రిష్టియన్లు, హిందువులు అందరికీ ఈ భాషవస్తుంది. ఇది నాభాషయని ప్రతి వ్యక్తి చెప్పుకోవాలనేది నా కోరిక.

## సంస్కృతం స్త్రీలకు వస్తుందా ?

ఇది చాలా సామాన్యమైన ప్రశ్న. వేద కాలంలోగార్గి మైత్రేయి మొ॥ స్త్రీ ఋషులు గలరు గంగాదేవి అనే కవయిత్రి మధురావిజయం అనే గొప్పకావ్యాన్ని వ్రాసింది. దీనికి మా గురుదేవులైన బ్రహ్మశ్రీ పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు గొప్ప వ్యాఖ్యానాన్ని వ్రాసారు.

ఇంకావిజ్జిక, సుభద్ర, ఫల్గుహస్తినీ, రామభద్రాంబ, మోరికా, ఇందులేఖా, మారులా, వికట నితంబా, లక్షీమా, వైజయన్తి, త్రివేణీ,



క్షమ మొదలైన ఎందరో స్త్రీ కవయిత్రులు మధురమనోజ్ఞంగా సూక్తులు, కావ్యాలు, వ్రాసారు. ఈరోజున గైర్వాణి తెలిసిన అనేక మంది స్త్రీలు భాషావేత్తలుగాను, రచయిత్రులుగా గోచరిస్తున్నారు.

## ఇతర భాషలకు సంస్కృతానికి గల తేడా ఏమిటి?

గైర్వాణిలో సుమారు 2000 ధాతువులున్నాయి. ధాతువులంటే క్రియలు (Verbs) గైర్వాణిలో ప్రతి పదానికీ వ్యుత్పత్త్యర్థం ఉండడం గొప్పవిశేషం. పృథివీ అంటే పరమాణువుల ఘర్షణతో ఘనీభవించినది. అని అర్థం. వృక్షః ఛేదింపబడేది అని అర్థం. ఇలా ప్రతి చోట వ్యుత్పత్త్యర్థం (Etymological sense) గోచరిస్తుంది. సంస్కృతంలో వాల్మీకి, వ్యాస, కాళిదాసాది మహాకవులు అంతర్జాతీయ ఖ్యాతి నార్జించారు. సంస్కృతంలోని పాణిని వ్యాకరణం సుమారు 5,000 సూత్రాలతో వ్రాయబడింది ఇంత పెద్ద వ్యాకరణం ఏ భాషకీ లేదేమో ?

## సంస్కృతంలో అన్ని విషయాలు ఉన్నాయా ?

సంస్కృతంలో ప్రపంచ విజ్ఞానాన్నందించే వేదాలున్నాయి. అనేక విషయాలను తెలిపే పురాణాలు 18 ఉన్నాయి. ఇలాగే ఇంకా అనేక ఉప పురాణాలున్నాయి. కథాసరిత్సాగరం, బృహత్కథ, పంచతంత్రం మొదలైన కథలనేకాలున్నాయి. రసానందాన్నందించే మధుర కావ్యాలున్నాయి. వినోదాన్నిచ్చే శాకుంతల, ఉత్తర రామచరితాది నాటకాలున్నాయి. ఏకాంకికలున్నాయి. ఏకపాత్రాభినయాలున్నాయి. చారిత్రక

గ్రంథాలున్నాయి. కల్హణుని రాజతరంగిణి కాశ్మీరరాజుల చరిత్రలను వివరిస్తుంది. చరక, సుశ్రుత, వైద్యావతంసం మొదలగు అనేక గ్రంథాలు వైద్యవిషయాలను తెలియజేస్తున్నాయి. వీటిలో వివిధ రోగాలను తగ్గించే ఎన్నో మందుల తయారీలు చెప్పబడ్డాయి. బృహజ్జాతకం, పారాశరసంహిత, మొ॥ గ్రంథాలు జ్యోతిశ్శాస్త్రాన్ని బోధిస్తున్నాయి ఆర్యభటీయం, స్ఫుట సిద్ధాంతం, లీలావతి గ్రంథాలు గణితాన్ని (Algebra) తెలియజేస్తున్నాయి బృహత్సంహిత, మొదలగు గ్రంథాలు భూగర్భ విషయాలను (Geology) తెలియ జేస్తున్నాయి. ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు మొ॥ గ్రంథాలు వేదాంత విషయాలను తెలుపుతాయి. ఆయుధాల తయారీలను రాజనీతిని (Politics) తెలిపే పుస్తకాలున్నాయి. భౌతిక క్రియా విషయాలను తెలిపే వైశేషికాదులు, రతి సర్వస్వాది కామశాస్త్ర గ్రంథాలు (Romance) పాకదర్పణాది పాకశాస్త్ర గ్రంథాలు (Cooking) వాస్తు గ్రంథాలు, వృక్షాలను పెంచే పద్ధతులు ఇలాంటివి ఎన్నెన్నో ఉన్నాయి.

సంస్కృతంలో కేవలం ఆధ్యాత్మిక విషయాలు లేక శృంగార విషయాలు మాత్రమే ఉంటాయనుకోవడం పొరపాటు.

## సంస్కృతంలో ఇతర చిన్న చిన్న విషయాలున్నాయా?

సంస్కృతంలో కేవలం పైవిషయాలేగాక చిత్రలేఖనం సంగీతం, నృత్యం, పొడుపుకథలు సంసోక్తులు మొదలైనవి కూడా ఎన్నో ఉన్నాయి. ఈ క్రింది శ్లోకంలో నిత్యజీవితంలో ఉపయోగపడే విషయాలెలా చెప్పబడ్డాయో చూడండి—



'ఘృతం తైలేన తచ్ఛోషజలైరుద్గేన కజ్జలమ్
వాసయే దంబరస్థం తు మలం క్షారేణ సోష్మణా'

నేతి మరకలను నూనెతోను, నూనెమరకలను వేడినీళ్ళతోను, కాటుకమరకలను పాలతోను, నుసికిని ఉప్పునీటితోను పోగొట్టాలి. బట్టలపై మసికలను తొలగించే పద్ధతి యిందులో చూపబడింది.

ఇంకా తాంబూలం తయారుచేసే పద్ధతి, కోళ్ళపందెములు సమస్యలు, ఛలోక్తులు ఇంకా ఎన్నెన్నో!

## సంస్కృతంలో పత్రికలున్నాయా?

సంస్కృతంలో ఇంతవరకు 3 దినపత్రికలు, 2 వారపత్రికలు, 8 పక్షపత్రికలు, 31 మాసపత్రికలు, 19 త్రైమాసిక పత్రికలు, 8 షాణ్మాసిక పత్రికలు (Half yearly) 15 సంవత్సర పత్రికలు ప్రారంభింపబడ్డాయి. వీటిలో చాలా పత్రికలు నడవడంలేదు. వీటిలో సంవిత్, స్వరమంగళా, సాగరికా, సంస్కృత ప్రతిభ పత్రికలు చాలా బాగుంటాయి. చిత్తూరునుండి వచ్చే ఆంధ్రుల పత్రిక గైర్వాణి.

## సంస్కృతంలో పాటలు

సంస్కృతంలో అనాది నుండి సంగీత బద్ధమైన పాటలెన్నో కానవస్తున్నాయి. జయదేవుని అష్టపదులు, కాళిదాసుని గీతాలు, అన్నమాచార్య, త్యాగరాజ శ్యామాశాస్త్రిల గీతాలేగాక అధునాతనంగా గూడా గేయాలువస్తున్నాయి. అవి సంస్కృతం పాటలని చెబితేగాని తెలియనంతగా సంస్కృత గీతాలు తెలుగులో కలసిపోయి ఆంధ్రుల అభిమానాన్ని చూఱగొన్నాయి. వందేమాతరం గేయం అటువంటిదే. "శ్రీవేంకటేశ్వర మాహాత్మ్యం" సినిమాలోని "పాహిహరేపాహిహరే"

పాట "శకుంతలసినిమా"లోని "సరసిజమనువిద్ధం" "అనాఘ్రాతం" అనే శాకుంతల పద్యాలు, ఇతర చిత్రాలలోని జయదేవుని గేయాలు సామాన్యులనుగూడా అలరిస్తున్నాయి.

## సంస్కృతంలో ప్రౌఢత్వ పాండిత్యాలు

కవులు యమకాలు శ్లోకాల్లలుగా వాశారు. పూర్వార్థంలాగా, ఉత్తరార్థం వ్రాయడం, నాలుగుపాదాలు ఒకలాగే వ్రాయడం, ఇంకా వెనుకనుంచి చదివినా శ్లోకం వచ్చే విధంగా వ్రాయడం, ఏకాక్షర, ద్వ్యక్షర శ్లోకాలు, రెండు మూడర్థాల శ్లేషకావ్యాలు, ఐదురకాల శ్లేషలు నూరు అర్థాలొచ్చే శ్లేషలుగూడా ఉన్నాయి. నేను వ్రాసిన "శక్తిస్తుతి" గ్రంధంలో రెండక్షరాల శ్లోకమును చూడవచ్చు. అనంతమైన ఈ సంస్కృతంలో జీవితాలు గడిపినా సంపాదించవలసిన పాండిత్యం మిగులుతూనే ఉంటుంది. ఎవరి ఓపికకొద్దీ వాళ్ళు పరుగెత్తవచ్చు. పాండిత్యం సంపాదించవచ్చు. సర్కస్‌ఫీట్లు చెయ్యవచ్చు. ఈ భాష గాంభీర్యానికిగాని, పదాలకుగాని పెన్నిధి.

## సంస్కృతాన్ని పెద్దలు ప్రశంసించారా?

ప్రశంసించారని ఖచ్చితంగా చెప్పవచ్చు. ప్రాచీనులందరూ మెచ్చుకొన్నారు. నవీనులలో డాక్టరు రాధాకృష్ణ, రాజేంద్రప్రసాద్, నెహ్రూ, గాంధి, టాగూర్, గేటే, వివేకానందుడు, వినోబాభావే, అబూకలాం అజాద్, సర్ మీర్జా ఇస్మాయిల్, గోవిందమీనన్, మొరార్జీ, నందా, గోపాలరెడ్డి, పట్టాభి, రాహుల్ సాంకృత్యాయన్, జయప్రకాశ్‌నారాయణ, జైల్‌సింగ్, ఇందిరాగాంధీ, మొదలైన వారెందరో ప్రశంసించారు. సంస్కృత కమిషనువారి నివేదికలో దీన్ని రాజభాష చేయడంలో గల ఔచిత్యం వివరింపబడింది. అవన్నీ ఇక్కడ కూర్చడం సాధ్యంగాదు.



## ప్రస్తుతం సంస్కృత పరిస్థితి ఎలావుంది?

లండన్‌లోని ప్రతి హైస్కూలులోను సంస్కృతం తప్పనిసరిగా చదవాల్సిన పరిస్థితివుంది 900 మంది విద్యార్థులున్నారు. ఈ స్కూలు వెల్లింగ్టన్ సమీపంలో ఉంది. ఖాట్మండులో సంస్కృత విశ్వవిద్యాలయం పెట్టడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. సంస్కృతంలో పిల్లల పత్రికయిన 'చందమామ' కూడా వస్తూంది. సుమారు 20 సంవత్సరాల నుండి సంస్కృతంలో వార్తలు రేడియోలలో వస్తున్నాయి. లండన్‌లో వేదగణితం, కౌముదీబోధింపబడుతున్నాయి "శంకరాచార్య" అనే సినిమా పూర్తిగా సంస్కృతంలోనే తీయబడింది. బొంబాయిలో హౌస్‌ఫుల్ కలెక్షన్లతో నడిచింది. జర్మనీ రేడియోలలో సంస్కృత కార్యక్రమాలెన్నో వస్తున్నాయి.

విశ్వహిందూ ప్రతిష్ఠానంవారి ఆధ్వర్యంలో డిసెంబరు 84 మొదటి వారంలో సంస్కృత సంభాషణా శిబిరం బెంగుళూరులో నిర్వహింపబడింది. ఈ ప్రాంతంలోని 108 కేంద్రాలలో సంభాషణా శిబిరాలు నిర్వహింపబడ్డాయి. 5, 200 మంది హాజరయ్యారు. సంస్కృతంలో కంప్యూటర్ కూడా ప్రదర్శింపబడింది సంస్కృతం వ్యవహార భాషయని హైకోర్టు జడ్జియైన శ్రీ వి. యస్. మలిమత్‌గారు చెబుతూ ప్రతిష్ఠాన కార్యక్రమాన్ని ప్రశంసించారు. శ్రీ ఆదిశంకరాచార్య సంస్కృత చిత్రానికి అవార్డు లభించింది. ఈ సినిమా దర్శకులయిన శ్రీ జి. వి. అయ్యర్, సుధర్మయనే సంస్కృత దినపత్రికా సంపాదకులైన శ్రీ వరదరాజు అయ్యంగారు, సంస్కృత చందమామ ప్రచురణకర్తలైన శ్రీ నాగిరెడ్డిగార్లు ఈ సందర్భంగా సత్కరింపబడ్డారు.

అంతర్జాతీయ వివేక కేంద్రంవారు, కోయంబత్తూరు సమీపము నందలి పొల్లాచి హైస్కూలులో "సంస్కృతంలో మాట్లాడండి." అనే పది రోజుల కార్యక్రమాన్ని నవంబరు చివరి వారంలో నిర్వహించారు. ఇది సత్ఫలితాల నిచ్చిందని సెక్రటరీ అయిన బాల ప్రసాదలాల్‌గారు చెప్పారు.

ప్రపంచ సంస్కృత విద్వాంసుల సభలు TORINO (Italy), Paris, Weimar (GDR), కాశీ నగరాలలో జరిగాయి. ఈ సంవత్సరము 20 దేశాల నుండి వచ్చిన 800 మంది ప్రతినిధులతో ఫిలాడెల్ఫియా (Philadelphia) దేశంలోని Pennsylvania పెన్సిల్వానియా విశ్వవిద్యాలయములో జరిగింది. కొద్దిరోజుల క్రితం సంస్కృతంలో షార్ట్‌హాండ్ పద్ధతికూడా విజయవంతంగా కనుగొనబడింది. సంస్కృతాక్షరాలతో కంప్యూటరుసిస్టంగూడా తయారవుతూంది. విశ్వ సంస్కృత ప్రతిష్ఠానం, పాండిచ్చేరివాళ్ళు అన్నిచోట్లా సంస్కృత సంభాషణా శిబిరాలను నిర్వహిస్తున్నారు. ఢిల్లీలో సంస్కృత భవనాన్ని 50 లక్షలతో నిర్మించడానికి శంఖుస్థాపన జరిగింది.

బేసిక్ విధానంలో క్రియారహిత విధానం గొప్పది. సంస్కృతంలో జ, ద, ధి, వాహ మొ॥ ప్రత్యయాలు ఉపసర్గ విధానాలు భాషను సులభంగా మాట్లాడటానికి ఎంతగానో ఉపయోగపడతాయి. బేసిక్ విధానం సంస్కృతంలో క్రొత్తకాదు. సంస్కృతంలోని ప్రతి పదానికి వ్యుత్పత్తి ఉండటం వలన "అర్థంలేని చదువు వ్యర్థం" అనేది ఈ భాషకే ఎక్కువగా అన్వయిస్తుంది.

ఇంత గొప్పభాష వ్యర్థమని, తీసివేయాలని కోరేవారి వాదాలలో హేతువులేమిటో తెలియదు. ఇంకా ఈ భాషగురించి చెప్పాల్సింది చాలా



వుంది. మరొక సందర్భంలో చెబుతాను. రెండునెలల స్వల్పకాలంలో శబ్దమంజరి, ఈ పుస్తకాలద్వారా అతి సులభంగా అందరికీ భాషాజ్ఞానం కలుగుతుంది. ఈ భాషలో అమరకోశం వంటి నిఘంటువులు శ్లోకాలలో ఉండడం వలన పర్యాయపదాలు నోటికి త్వరగావస్తాయి. ఇది ఈ భాషలోని వైశిష్ట్యం. ఈ భాషను నేనిలా కీర్తిస్తాను.

'రారాజతామియం వాణీ సంస్కృతాచ పురాతనీ
జ్ఞానం విజ్ఞాన మపినోదేయాత్ పద్మాసన ప్రియా'.

ఇక పాఠాలలోకి నడవండి—

పాఠము - 1

## విభక్తులు

సంస్కృతము నందలి పదములు సుబన్తములని, తిఙన్తములని రెండురకములు. సుబన్తములనగా విభక్తులతో కూడిన పదములు. తిఙన్తములనగా క్రియలు. క్రియలను తరువాత పరిశీలింతము. విభక్తులనే ఆంగ్లమున Cases అందురు డు, ము, వు, లు మొ॥ వానిని విభక్తులందురు. పదానికి ఈ విభక్తులను చేర్చి వాడవలయును. కేవలము పదమునుగాని, కేవలము విభక్తి ప్రత్యయముగాని వాడరాదు. తెలుగులో అయితే రాము అనిగాని, లేదా డు అనిగాని వాడరాదు. రెంటినీ కలిపే రాముడు అనివాడాలి. కేవలం అర్థాన్ని చెప్పే పదాన్ని ప్రాతిపదికము అంటారు. దానికి చేరేదాన్ని విభక్తిప్రత్యయము అంటారు.

పదాన్ని, ప్రత్యయాన్ని కలిపితే సంధి జరిగి రూపంలో మార్పు వస్తుంది. పైగా సంస్కృతంలో పదం తరువాతే ప్రత్యయాన్ని చేర్చాలి. ఆంగ్లభాషలో పదాన్ని ప్రత్యయాన్ని కలిపినా సంధిరాదు. పదాలు

విడివిడిగానే ఉంటాయి. అందుకే వాటిని మోనోసిలబిక్ భాషలంటారు. పదానికి ముందే ప్రత్యయాన్ని వాడుతారు.

ఉదా : To him, From him, In that i. e. సంస్కృతంలో ఇలాకాదు.

ఏ అక్షరం చివర వినిపిస్తుందో ఆ అంతమైన పదం అంటారు. ఉదా : 'రామ' అనగా చివర అకారం ఉంది గనుక ఇది అకారాంతం, ఇలాగే ఇకారాంతం మొదలైనవి.

1. అకారాంత పదాలకు ప్రథమా విభక్తిలో ఏక వచనంలో 'ః అని' ద్వివచనంలో ఔ అని బహువచనంలో ఆః అనివినిపిస్తోంది. ఉదా : వృక్షః-వృక్షౌ-వృక్షాః. ఇలాగే అంటే వృక్షశబ్దానికి ప్రథమా విభక్తికి మూడు వచనాలలో ఎలా ఉందో అలాగే ఈ క్రింది అకారాంత పుంలింగ పదాలకు కూడ ప్రథమావిభక్తిలోని మూడు వచనాలను చెప్ప వచ్చు. తటః (Bank) తటౌ (Two Banks) తటాః (Banks).

“సౌధః, గేహః, మనుష్యః అపాంగః, అలంకారః, ఆపణః, ఆతపః” మొ॥

2. ఇకారాంత పుంలింగ పదాలకు ప్రథమావిభక్తిలో విధిః-విధీ-విధయః అన్నట్లుగా రూపాలుంటాయి. ఇలాగే ఈ క్రింది ఇకారాంత పదాలకు గూడా ప్రథమావిభక్తి చెప్పాలి. మణిః, పాణిః, కిటిః, యతిః మొ॥

3. ఉకారాంత పుంలింగ పదాలకు ఇందుః-ఇందూ-ఇందవః అన్నట్లుగా ప్రథమలో రూపాలుంటాయి.

ఉదా : విధుః, హనుః, భానుః, పటుః మొ॥



4. ఋకారాంత పదాలకు ప్రథమలో ధాతా- ధాతారౌ- ధాతారః అన్నట్లుగా రూపాలుంటాయి. ఉదా: దాతా, హన్తా, భోక్తా, మంతా మొ॥

5. ఓకారాంత పుంలింగ పదాలకు గౌః-గావౌ-గావః అనే విధంగా రూపాలుంటాయి. ఉదా: గ్లౌః మొ॥

6. శకారం నుండి ధకారాంత పదాల వరకు ప్రథమలో ఏక వచనంలో హల్లు, ద్వివచనంలో ఔ అని బహువచనంలో విసర్గ కనుపిస్తాయి. ఉదా: భిషక్-భిషజౌ-భిషజః ఉదా;జలముక్, ప్రాజ్, సుగణ్, మరుత్, దివిషద్, బుధ్ మొ॥. కొన్ని తకారాంతాలు పచన్, పచన్తౌ, పచన్తః అన్నట్లు చెప్పాలి.

7. నకారాంత పుంలింగ పదాలకు రాజా- రాజానౌ-రాజానః అనే విధంగా వుంటాయి. ఉదా;ఆత్మా, యజ్వా, అశ్వత్థామా మొ॥

కొన్ని నకారాంతాలకు గుణీ- గుణినౌ- గుణినః అన్నట్లు రూపాలుంటాయి. ధనీ-ప్రాణీ-మానీ మొ॥

అనగా నకారానికి ముందు అకారం ఆకారంగాను, ఇకారం ఈకారంగాను మారి చివరి నకారం లోపిస్తుంది.

8. మకారాంతపదాలకు ప్రథమావిభక్తిలో కః-కౌ-కే అన్నట్లు రూపాలుంటాయి. ఇదం శబ్దానికి అయం- ఇమౌ-ఇమే అని రూపాలు.

9. రేఫాంత పద మైన కిర్ శబ్దానికి కీః-కిరౌ-కిరః అని రూపాలు.

10. ద్యౌ శబ్దం వకారాంతం. దీనికి ద్యౌః-దివౌ-దివః అని రూపాలు.

11. శకారాంతాలకు తాదృక్-తాదృశౌ-తాదృశః అని రూపాలు ఇలాగే నిట్, నట్. షకారాంతాలు గూడా ఇలాగే. ఉదా:రత్నముట్-

12. సకారాంతాలు ఇలా వుంటాయి. విద్వాన్- విద్వాంసౌ. విద్వాంసః, పుమాన్-పుమాంసౌ-పుమాంసః, ఉశనాః-ఉశనసౌ-ఉశనసః

పాఠము - 2

# స్త్రీలింగపదాలకు ప్రథమావిభక్తులు

ఆకారాంతాలన్నీ రమా-రమే-రమాః అన్నట్లు చెప్పాలి. ఇకారాంతాలన్నీ మతిః-మతీ-మతయః అని చెప్పాలి. ఈకారాంతాలు గౌరీ-గౌర్యౌ-గౌర్యః అన్నట్లు చెప్పాలి. ఊకారాంతాలు వధూః-వధ్వౌ వధ్వః అన్న విధంగాను, ఓకారాంతాలు గౌః-గావౌ- గావః అనే పద్ధతిలోనూ చెప్పాలి. మిగిలినవి మామూలే.

# నపుంసక లింగాలకు ప్రథమా విభక్తులు

అకారాంతాలు:- జ్ఞానం, జ్ఞానే, జ్ఞానాని అని చెప్పాలి. ఇలాగే వన, ధన, ఫల మొ॥

ఇకారాంతాలు:- వారి, వారిణీ, వారీణి. అని చెప్పాలి.

ఉకారాంతాలు:- మృదు, మృదునీ, మృదూని అని చెప్పాలి

ఋకారాంతాలు:- కర్తృ, కర్తృణీ,కర్తౄణి అని చెప్పాలి. హలంతాలలో చాలాభాగం పదాలు, హృత్-హృదీ-హృన్దిలాగా చెప్పాలి.

సర్వనామ పదాలకు పుంలింగాలలో కః-కౌ-కే అనేవిధంగా, స్త్రీ లింగంలో కా-కే-కాః అనే విధంగా, నపుంసక లింగాలలో కిం-కే-కాని అనే విధంగాను ఉంటాయి.



ఈ క్రింది శ్లోకంలో ప్రథమా విభక్తులను చూడండి-

"ఉద్యమః సాహసం ధైర్యం బుద్ధిః శక్తిః పరాక్రమః
షడేతే యత్ర వర్తన్తే తత్ర దేవః సహాయకృత్"

ఈ క్రింది వాక్యములలో ప్రథమా విభక్తులను గుర్తించుడు:-
రాజా జనాన్ శాస్తి. మనుష్యాః సుమనసః భవేయుః. నక్షత్రాణి రాత్రౌ ప్రకాశన్తే. బాలగంగాధరః ఝాన్సీ లక్ష్మీః స్వాతంత్ర్యాయ ప్రయత్నం చక్రతుః. అళయః పుష్పేషు చరన్తి. సేవకా పచన్తి.

పాఠము - 3

# జంతవః-జంతువులు

| | | | |
|---|---|---|---|
| కాకః | ; కాకి | అశ్వః | ; గుఱ్ఱము |
| బకః | : కొంగ | భల్లూకః | : ఎలుగుబంటు |
| ఉలూకః | : గుడ్లగూబ | సింహః | : సింహము |
| సర్పః | : పాము | మత్స్యః | ; చేప |
| గోనసః | : కొండచిలువ | జలకుంజరః | : నీటి ఏనుగు |
| అజగరః | : పెద్దపాము | శలభః | : మిడుత |
| గంధోలీ | : కందిరీగ | కోకిలః | : కోకిల |
| శకరః | : రాబందు | వరాహః | : పంది |
| గృధ్రః | : గ్రద్ద | ఖంజరీటః | : కాటుకపిట్ట |
| చాషః | : పాలపిట్ట | సారసః | : బెగ్గురుపిట్ట |
| మృగాదనః | : శివంగి | తిత్తిరిః | : తీతువుపిట్ట |
| శతపత్రకః | : వడ్రంగిపిట్ట | జలవ్యాళః | : నీళ్ళకొయ్య |

| | | | |
|---|---|---|---|
| చిక్రోడః | : ఉడుత | ఉష్ట్రః | : ఒంటె |
| ఇంద్రలుప్తః | : పేను | గౌళిః | : బల్లి |
| మశకః | : దోమ | ధూమ్రాటః | : కూకటిపిట్ట |
| శరారిః | : బాతు | జలూకా | : జెట్టి |
| కుక్కుటః | : కోడి | కర్ణజలూకా | : నల్లజెట్టి |
| హరిణః | : లేడి | వృశ్చికః | : తేలు |
| మర్కటః | : కోతి | కర్కటః | : ఎండ్రకాయ |
| మహిషః | : దున్నపోతు | కృష్ణసర్పః | : త్రాచుపాము |
| రక్తపా | : జలగ | శశః | : కుందేలు |
| శరభః | : తోడేళ్ళను | సరటః | : తొండ |
| | చంపేజంతువు | చటకః | : పిచ్చుక |
| వృకః | : తోడేలు | మక్షికా | : ఈగ |
| గవయః | : అడవిగోవు | ఖద్యోతః | : మిణుగురు పురుగు |
| హారీతః | : పచ్చనిపిట్ట | కచ్ఛపః | : తాబేలు |
| గోధా | : ఉడుము | ఖడ్గీ | : ఖడ్గమృగము |
| శ్వేతయూకః | : చీరపేను | చాతకః | : వానకోయిల |
| కపింజలః | : కౌజుపిట్ట | మూషికః | : ఎలుక |
| మహీలతా | : వానపాము | చుచుందరః | : చిట్టెలుక |
| శునకః | : కుక్క | క్రిమిః | : క్రిమి |
| నకులః | : ముంగిస | వ్యాఘ్రాటః | : ఏట్రింత |
| వళీముఖః | : కొండముచ్చు | | మృగము |



| | | | |
|---|---|---|---|
| వృషభః | : ఎద్దు | కరేటుః | : కొక్కెర |
| వ్యాఘ్రః | : పెద్దపులి | శరారిః | : ఆదేలు |
| భ్రమరః | : తుమ్మెద | పతంగికా | : తెరయీగ |
| మయూరః | : నెమలి | ఝిల్లికా | : చిమ్మెట పురుగు |
| తిమిః | : ఒక పెద్దచేప | టిట్టిభకః | : లకుముకిపిట్ట |
| పక్షి | : పక్షి | వర్తకః | : వల్లంకిపిట్ట |
| శ్యేనః | : డేగ | కీటః | : పురుగు |
| ఇంద్రగోపః | : ఆర్ద్రపురుగు | తైలపాయికా | : గబ్బిలము |
| చక్రవాకః | : జక్కువపిట్ట | జంబుకః | : నక్క |
| మత్కుణః | : నల్లి | లూతా | : సాలెపురుగు |
| మద్గుః | : నీటికాకి | శుకః | : చిలుక |
| రక్తపుచ్ఛీ | : నల్లికెళ్ళపాము | సరఘా | : తేనెటీగ |
| మార్జాలః | : పిల్లి | చకోరః | : వెన్నెలపిట్ట |
| గజః | : ఏనుగు | శలభః | : గొల్లభామ |
| మేషః | : మేక | కోషకారః | : గొంగళిపురుగు |
| గౌః | : ఆవు | భేకః | : కప్ప |
| చిత్రకః | : చిఱుతపులి | కపోతః | : పావురము |
| పిపీలికా | : చీమ | ఘుణా | : చెదపురుగు |
| మకరః | : మొసలి | చమరీ | : చమరీమృగము |
| తిమింగిలః | : తిమింగిలము | పాఠీనః | : బేడిసచేప |

గార్దభః : గాడిద చిత్రపతంగః : సీతాకోకచిలుక
హంసః : హంస క్షౌమక్రిమిః : పట్టుపురుగు

---

"Since time immemorial this language has been instrumental in forging the Unity of the Country"

—JAIL SINGH

"ఎల్ల భాషలకును జనని సంస్కృతంబు"

—శ్రీకృష్ణదేవరాయలు

పాఠము – 4

## సంబోధన ప్రథమా విభక్తులు

ఒకరిని ఉద్దేశించి మాట్లేడే సమయంలో సంబోధన ప్రథమా విభక్తిని వాడుతారు. హే, భోః, మొదలైనవి సంబోధనలను తెలుపుతాయి. అయితే ఇవి పాడకుండా ప్రయోగించవచ్చు.

అకారాంత పుంలింగపదాలు : రామ రామౌ రామాః

ఇకారాంత పుంలింగపదాలు : కవే కవీ కవయః

ఉకారాంత పుంలింగపదాలు : విష్ణో విష్ణూ విష్ణవః

ఋకారాంత పుంలింగపదాలు : దాతః దాతారౌ దాతారః

సాధారణంగా హలంత పుంలింగ పదాలకు ప్రథమలాగే సంబోధన ప్రథమ కూడా ఉంటుంది.



ఉదా :– జలముక్, భిషక్, విట్, లిట్, దివిషత్, మరుత్

ఈ క్రింది హలంత పుంలింగ శబ్దాలకు మాత్రం సంబోధన ప్రథమలో, ప్రథమలో ఉండేదీర్ఘం హ్రస్వమౌతుంది. ధీమాన్ (ప్ర.) హేధీమన్ (సం. ప్ర.) మహాన్ (ప్ర.) హే మహన్ (సం. ప్ర.) విద్వాన్ (ప్ర.) హే విద్వన్ (సం. ప్ర.)

నకారాంతాలు : గుణిన్, స్వామిన్ ఇలా ఉంటాయి.

ఆకారాంత స్త్రీలింగ పదాలు : లతే లతే లతాః

ఇకారాంత స్త్రీలింగ పదాలు : కృతే కృతీ కృతయః

ఈకారాంత స్త్రీలింగ పదాలు : నది నద్యౌ నద్యః

ఉకారాంత స్త్రీలింగ పదాలు : ధేనో ధేనూ ధేనవః

ఊకారాంత స్త్రీలింగ పదాలు : చమూః చమ్వౌ చమ్వః

ఋకారాంత స్త్రీలింగ పదాలు : మాతః మాతరౌ మాతరః

హలంత స్త్రీలింగ పదాలు సాధారణంగా ప్రథమలో లాగానే ఉంటాయి.

నపుంసక లింగ పదాలన్నీ ప్రథమా విభక్తిలోవలె సంబోధనలో గూడా ఉంటాయి.

ఈ క్రింది శ్లోక పదాలలో సంబోధన ప్రథమా విభక్తులను చూడుడు :–

"హే గోపాలక "హే కృపాజలనిధే" "హే జగత్త్రియగురో" "స్వామిన్ జనకతనయా వల్లభ విభో" "సరసిజనిలయే" సరోజహస్తే", "ఆనంద గోవింద ముకుంద రామ"

ఈ క్రింది పంక్తులలో సంబోధనలను గుర్తించనడి.

1. మాతః కదా రక్షసి ?  2. సర్వాత్మన్ విశ్వేశ పాహి

3. కాత్వం బాలే ?  4. భిక్షో మాంసనిషేవణం కిముచితమ్ ?

5. కుత్ర రాజ్ఞౌ గచ్ఛతః ?  6. కవే, పండిత ఆగచ్ఛతమ్.

## ఆహారాః : ఆహార పదార్థములు

| | | | |
|---|---|---|---|
| అభిషుతమ్ | : పుల్లగంజి | గోధూమాః | : గోధుమలు |
| అన్నమ్ | : అన్నము | ఘృతమ్ | : నెయ్యి |
| ఆఢకాః | : కందులు | చణకాః | : శనగలు |
| ఆఢకసూపః | : కందిపప్పు | చణకతైలమ్ | : శనగనూనె |
| ఆమిక్షా | : వేడిపాలలో పెరుగు వేసి చేసినది | | |
| ఆమ్లఖలః | : దప్పలము | తింత్రిణీరసః | : చారు |
| ఉపదంశః | : కొరుక్కుతినేది | తిలతైలమ్ | : నువ్వులనూనె |
| ఐరండతైలమ్ | : ఆముదము | తైతిలః | : పంచదార లేనిపూరీలు |
| కలాయాః | : బటానీలు, శనగలు (గుండ్రవి) | | |
| కాంజికమ్ | : గంజి | తైలమ్ | : నూనె |
| కుబేరమూలమ్ | : జంతికలు | దధి | : పెరుగు |
| కూర్చికా | : విరిగినపాలు | నారికేళతైలమ్ | : కొబ్బరినూనె |
| కృసరః | : పులగము | పర్పటః | : అప్పడము |
| కాబేరమ్ | : అంబలి | పీయూషమ్ | : జున్నుపాలు |
| క్వథితమ్ | : సాంబారు | మస్తు | : మీగడ |



| | | | |
|---|---|---|---|
| మాషః | : మినుములు | వటకమ్ | : వడియము |
| మాషచక్రమ్ | : గారె | వ్యంజనమ్ | : నంజుకొనేది |
| ముద్గాః | : పెసలు | శాకః | : కూర |
| ముద్గయూషః | : పెసరకట్టు | సర్షపతైలమ్ | : ఆవనూనె |
| ముద్గసూపః | : పెసరపప్పు | సూపః | : పప్పు |
| | | క్షీరమ్ | : పాలు |

## ద్వితీయా విభక్తి

| | | |
|---|---|---|
| అకారాంత పుంలింగాలు | | : రామం - రామౌ - రామాన్ |
| ఇకారాంత | ,, | : కపిం - కపీ - కపీన్ |
| ఉకారాంత | ,, | : విధుం - విధూ - విధూన్ |
| ఋకారాంత | ,, | : ధాతారం - ధాతారౌ - ధాతౄన్ |
| హలంత | ,, | : భిషజం - భిషజౌ - భిషజః |
| ఆకారాంత స్త్రీలింగాలు | | : లతాం - లతే - లతాః |
| ఇకారాంత | ,, | : నతిం - నతీ - నతీః |
| ఈకారాంత | ,, | : నదీం - నద్యౌ - నదీః |
| ఉకారాంత | ,, | : ధేనుం - ధేనూ ధేనూః |
| ఊకారాంత | ,, | : చమూం - చమ్వౌ - చమూః |

ఋకారాంత స్త్రీలింగపదాలు : మాతరం-మాతరౌ-మాతౄః

నపుంసకలింగ పదాలన్నీ ప్రథమావిభక్తిలో ఎలా ఉంటాయో ద్వితీయా విభక్తిలో కూడా అలాగే ఉంటాయి.

ఈ క్రింది శ్లోకంలో ద్వితీయా విభక్తులను చూడండి :-

గుణో భూషయతే రూపం శీలం భూషయతే కులమ్
సిద్ధిర్భూషయతే విద్యాం భోగో భూషయతే ధనమ్

ఈ క్రింది వాక్యములలో ద్వితీయా విభక్తులను గుర్తించుడు.

1. వాణీంగజల గైర్వాణీమ్. 2. కృష్ణం నమన్తి భక్తాః.
3. వారి దదాతి గ్రీష్మే. 4. జ్ఞానం పండితాః ఇచ్ఛన్తి.
5. దాతౄన్ యాచకాః శంసన్తి.
6. భ్రమరాః మధూని పిబన్తి.

## తృతీయా విభక్తి

అకారాంత పుంలింగ పదాలు : వృక్షేణ-వృక్షాభ్యాం-వృక్షైః
ఇకారాంత పుంలింగపదాలు : కవినా-కవిభ్యాం-కవిభిః
ఉకారాంత పుంలింగపదాలు : విధునా-విధుభ్యాం-విధుభిః
ఋకారాంత పుంలింగపదాలు : దాత్రా-దాతృభ్యాం-దాతృభిః
హలంత పుంలింగ పదాలు : భిషజా-భిషగ్భ్యాం-భిషగ్భిః
ఆకారాంత స్త్రీలింగ పదాలు : లతయా-లతాభ్యాం-లతాభిః
ఇకారాంత స్త్రీలింగ పదాలు : నత్యా-నతిభ్యాం-నతిభిః
ఈకారాంత స్త్రీలింగ పదాలు : నద్యా-నదీభ్యాం-నదీభిః
ఉకారాంత స్త్రీలింగ పదాలు : ధేన్వా-ధేనుభ్యాం-ధేనుభిః
ఊకారాంత స్త్రీలింగ పదాలు : చమ్వా-చమూభ్యాం-చమూభిః



ఋకారాంత స్త్రీలింగ పదాలు : దాత్ర్యా-దాత్రీభ్యాం-దాత్రీభిః
హలంత స్త్రీలింగ పదాలు : ఉపానహా-ఉపానద్భ్యాం-ఉపానద్భిః

నపుంసక లింగ పదాలన్నీ సాధారణంగా పుంలింగ పదాలలాగానే ఉంటాయి.

ఈ క్రింది పద్యంలో తృతీయా విభక్తులను చూడండి :

అంగేన గాత్రం నయనేన వక్త్రమ్
న్యాయేన రాజ్యం లవణేన భోజ్యమ్
ధర్మేణ హీనం ఖలు జీవితం చ
న రాజతే చంద్రమసా వినా నిశా.

ఈ క్రింది వాక్యాలలో తృతీయా విభక్తులను గుర్తించండి :

1. వాచా శోభతే మనుష్యః. 2. వారిభిః జనాః సిచ్యన్తే.
3. విద్యార్థిభ్యాం పఠ్యతే. 4. రుచినా వస్త్రేణ రాజతే.
5. పార్వత్యా లిఖితం. 6. ఉపానద్భ్యాం శోభతే పాదయుగ్మమ్.

పాఠము-5

## చతుర్థీ విభక్తి

అకారాంత పుంలింగ పదాలు : వృక్షాయ-వృక్షాభ్యామ్-వృక్షేభ్యః
ఇకారాంత ,, : విధయే-విధిభ్యాం-విధిభ్యః
ఉకారాంత ,, : మధవే-మధుభ్యాం-మధుభ్యః
ఋకారాంత ,, : దాత్రే-దాతృభ్యాం-దాతృభ్యః

హలంత ,, : భిషజే భిషగ్భ్యాం-భిషగ్భ్యః

ఆకారాంత స్త్రీలింగ పదాలు : లతాయై-లతాభ్యాం-లతాభ్యః

ఇకారాంత ,, : మత్యై-మతిభ్యాం- మతిభ్యః

ఈకారాంత ,, : నద్యై-నదీభ్యాం-నదీభ్యః

ఉకారాంత ,, : ధేన్వై-ధేనుభ్యాం-ధేనుభ్యః

ఊకారాంత ,, : చమ్వై-చమూభ్యాం-చమూభ్యః

ఋకారాంత ,, : దాత్ర్యై–దాత్రీభ్యాం-దాత్రీభ్యః

హలంత ,, : నిశే-నిడ్భ్యాం-నిడ్భ్యః

ఆకారాంత నపుంసక లింగ పదాలన్నీ సాధారణంగా పుంలింగ పదాలవలె ఉంటాయి.

ఈ క్రింది శ్లోకంలో చతుర్థీ విభక్తులను చూడండి :

దరిద్రాయ ధనం దేయం జ్ఞానం దేయం జనాయ చ
పిపాసితాయ పానీయం క్షుధితాయ చ భోజనమ్.

ఈ క్రింది వాక్యాలలో చతుర్థులను గుర్తించండి :

1. పుష్పేభ్యః మధు పిబన్తి. 2. కవిభ్యః ధనం దదౌ.
3. లతాభ్యాం వారి దదాతి. 4. రోగిణే భిషక్ ఔషధం దదౌ.
5. దధ్నే బాలః ధావతి. 6. గృహాయ వాంఛతి.



# వ్యావహారిక పదాని : వాడుక పదములు

## బంధువులు

| | | | |
|---|---|---|---|
| అగ్రజః | : అన్నయ్య | ప్రపితామహీ | : ముత్తమామ్మ |
| అగ్రజా | : అక్కయ్య | ప్రమాతామహః | : ముత్తాత (తల్లివంక) |
| అనుజః | : తమ్ముడు | | |
| అనుజా | : చెల్లెలు | ప్రమాతామహీ | : ముత్తఅమ్మమ్మ |
| అనుజామాతా | : తోడిఅల్లుడు | పితృవ్యః | : పెదనాన్న లేక బాబాయి |
| ఆవుత్తః | : బావ(సోదరిభర్త) | | |
| ఉపపతిః | : ఉంచుకోబడినవాడు | పితృష్వసా | : మేనత్త (తండ్రి సోదరి) |
| ఉపపత్నీ | : ఉంపుడుగత్తె | | |
| గురుః | : ఉపాధ్యాయుడు | పితామహీ | : నాయనమ్మ (తండ్రి తల్లి) |
| గురుపత్నీ | : అమ్మగారు | | |
| జామాతా | : అల్లుడు | పితా | : తండ్రి |
| దేవరః | : బావగారు (భర్తఅన్నగారు) | పితామహః | ; తాత (తండ్రి తండ్రి) |
| దౌహిత్రః | : మనుమడు (కూతురుకొడుకు) | పుత్రః | : కుమారుడు |
| | | పుత్రీ | : కుమార్తె |
| దౌహిత్రీ | : మనుమరాలు (కూతురుకూతురు) | పైతృష్వస్రీయా | : మరదలు (మేనత్తకూతురు) |
| ననాందా | : ఆడబిడ్డ | పైతృష్వస్రీయః | : బావ (మేనత్త కొడుకు) |
| ప్రజావతీ | : వదిన | | |
| ప్రపితామహః | : ముత్తాత (తండ్రి వంక) | పౌత్రః | : మనుమడు (కొడుకు కొడుకు) |

| | | | |
|---|---|---|---|
| పౌత్రీ | : మనుమరాలు (కొడుకుకూతురు) | మాతులానీ | : మేనత్త |
| భాగినేయః | : మేనల్లుడు | మాతృష్వస్రీయః | : పిన్ని లేక పెద్దమ్మ కొడుకు |
| భాగినేయీ | : మేనకోడలు | మాతృష్వస్రీయా | : పిన్ని కూతురు |
| భ్రాతృజాయా | : వదిన లేక మరదలు | యాతా | : తోడికోడలు |
| | | వధూః | : పెండ్లికూతురు |
| మాతా | : తల్లి | శ్వశురః | : మామగారు |
| మాతామహః | : తాత (తల్లితండ్రి) | శ్వశ్రూః | : అత్తగారు |
| మాతామహీ | : అమ్మమ్మ (తల్లి తల్లి) | సపత్నీ | : సవతి |
| | | సాపత్న్యః | : సవతికొడుకు |
| మాతృష్వసా | : పిన్ని లేక దొడ్డమ్మ | స్నుషా | : కోడలు |
| | | సోదరః | : సోదరుడు |
| మాతులః | : మేనమామ | సోదరీ | : సోదరి |

# వ్యావహారిక పదాని-2

## శాకాః కూరలు

| | | | |
|---|---|---|---|
| అవాక్పుష్పీ | : బెండకాయ | బృహతీ | : ముళ్ళవంకాయ |
| ఉర్వారుకః | : దోసకాయ | మరిచకాః | : మిరపకాయలు |
| కర్కటీ | : నక్కదోసకాయ | రాజకోశాతకీ | : పెద్దబీర, బెంగుళూరు వంకాయ |
| కారవేల్లః | : కాకరకాయ | | |
| కోశాతకీ | : బీరకాయ | లశునః | : వెల్లుల్లి |
| జంబీరమ్ | : నిమ్మకాయ | వార్తాకః | : వంకాయ |



| | | | |
|---|---|---|---|
| త్రపుకర్కటీ | : ములుదోస | బింబమ్ | : దొండకాయ |
| పటోలికా | : పొట్లకాయ | శింబిః | : చిక్కుడుకాయ |
| పలాండుః | : నీరుల్లి | శీతలా | : సొరకాయ |
| పానసాని | : అగాకరకాయలు | సతీనకమ్ | : అలచందలు |
| క్షుద్రశింబిః | : గోరుచిక్కుడు | | |

## కందాః : దుంపలు

| | | | |
|---|---|---|---|
| ఆలుకమ్ | : బంగాళాదుంప | తింత్రిణీపల్లవాః | : చింతచిగురు |
| కారటః | : Carret | పాలక్యా | : మట్టుబచ్చలి |
| కూష్మాండః | : గుమ్మడికాయ | మత్స్యాక్షీ | : పొన్నగంటికూర |
| తృణబిందుకః | : చేమ దుంపలు | మేంధీ | : మెంతికూర |
| మూలకమ్ | : ముల్లంగి | వజ్రవల్లీ | : నల్లేరు |
| రంభాశలాటుః | : పచ్చిఅరటికాయ | వనవాస్తుకః | : కొయ్యతోటకూర |
| సూరణః | : కంద | వాస్తుకః | : తోటకూర |
| | | సర్షపశాకమ్ | : ఆవకూర (ఆవచెట్లఆకులు) |

## పత్రశాకాః :

| | | | |
|---|---|---|---|
| అత్యమ్లపర్ణా | : పుల్లబచ్చలి లేక చుక్కకూర | సురభిచ్ఛదః | : కరివేపాకు |
| | | సువిషణ్ణకశాకః | : నీరుచెంచలికూర |
| | | హిలమోచికా | ; చిలుకతోటకూర |
| ఉపోదకీ | ; బచ్చలి | | |
| కచూవరః | : గోంగూర | | |

## సంభారాః :

| | | | |
|---|---|---|---|
| కాకమాచీ | : కామంచికూర | ఆర్ద్రకమ్ | : అల్లం |
| కుస్తుంబరీ | : కొత్తిమీర | ఏలా | : ఏలక్కాయ |
| జీవా | : పాలకూర | కటుమోదః | : జవ్వాది |

కర్పూరమ్ : కర్పూరం
కాశ్మీరజన్మ : కుంకుంపువ్వు
జాతిపత్రికాః : జాపత్రి
జీరకః : జీలకర్ర
తిలకల్కః : తెలకపిండి
మరిచాః : మిరియాలు
మేంథీ : మెంతులు
హింగుః : ఇంగువ

లవంగమ్ : లవంగము
వితున్నకమ్ : ధనియాలు
సర్షపచూర్ణమ్ : ఆవపొడి
సుగంధద్రవ్యాణి: సుగంధ ద్రవ్యాలు, మసాలదినుసులు
సూక్ష్మబీజః : గసగసాలు

పాఠము-6

# పంచమీ విభక్తి

అకారాంత పుంలింగ పదాలు : వృక్షాత్-వృక్షాభ్యాం-వృక్షేభ్యః
ఇకారాంత పుంలింగపదాలు : కవేః కవిభ్యాం-కవిభ్యః
ఉకారాంత ,, : మధోః-మధుభ్యామ్-మధుభ్యః
ఋకారాంత ,, : దాతుః-దాతృభ్యాం-దాతృభ్యః
హలంత ,, : భిషజః భిషగ్భ్యాం-భిషగ్భ్యః
ఆకారాంత స్త్రీలింగపదాలు ; లతాయాః-లతాభ్యాం-లతాభ్యః
ఇకారాంత స్త్రీలింగపదాలు : నత్యాః-నతిభ్యాం-నతిభ్యః
ఈకారాంత స్త్రీలింగపదాలు ; నద్యాః-నదీభ్యాం-నదీభ్యః
ఉకారాంత స్త్రీ లింగపదాలు : ధేన్వాః-ధేనుభ్యాం-ధేనుభ్యః
ఋకారాంత ,, : మాతుః-మాతృభ్యాం-మాతృభ్యః
హలంత ,, : నిశః-నిడ్భ్యాం-నిడ్భ్యః



అకారాంత నపుంసకలింగ పదాలు పుంలింగ పదాల లాగానే ఉంటాయి.

ఇకారాంత నపుంసక లింగపదాలు : వారిణః-వారిభ్యాం-వారిభ్యః
ఉకారాంత ,, : మధునః-మధుభ్యాం-మధుభ్యః
ఋకారాంత ,, : దాతుః-దాతృభ్యాం-దాతృభ్యః
హలంత ,, : హృదః-హృద్భ్యాం-హృద్భ్యః

ఈ క్రింది పద్యంలో పంచమీ విభక్తులను చూడండి :

పర్వతానాం భయం వజ్రాత్ పద్మానాం శిశిరాత్ భయమ్
పాదపానాం భయం వాతాత్ సాధూనాం దుర్జనాత్ భయమ్

ఈ క్రింది వాక్యాలలో పంచమీ విభక్తులను గుర్తించుడు :

1. వృక్షాత్ పత్రం పతతి. 2. నద్యాః కచ్ఛపః ఆగచ్ఛతి.
3. ధాత్రీభ్యాం బాలః పోష్యతే. 4. మధునః బిందవః పతన్తి.
5. లతాభ్యాం భ్రమరాః అగచ్ఛన్తి. 6. నిశః చతుర్థో భాగః.

# షష్ఠీ విభక్తి

అకారాంత పుంలింగ పదాలు : వృక్షస్య-వృక్షయోః-వృక్షాణాం
ఇకారాంత పుంలింగ పదాలు : కవేః-కవ్యోః-కవీనాం
ఉకారాంత పుంలింగ పదాలు : భానోః-భాన్వోః-భానూనాం
ఋకారాంత ,, : కర్తుః-కర్త్రోః-కర్తౄణాం
హలంత ,, : భిషజః-భిషజోః-భిషజాం

ఆకారాంత స్త్రీలింగ పదాలు : లతాయాః-లతయోః-లతానాం

ఇకారాంత స్త్రీలింగ పదాలు : నత్యాః-నత్యోః-నతీనాం

ఈకారాంత స్త్రీలింగ పదాలు : నద్యాః-నద్యోః-నదీనాం

ఉకారాంత స్త్రీలింగ పదాలు : ధేన్వాః-ధేన్వోః-ధేనూనాం

ఋకారాంత ,, : మాతుః-మాత్రోః-మాతౄణామ్

హలంత ,, : గిరః-గిరోః-గిరాం

అకారాంత నపుంసకపదాలు షష్ఠీ విభక్తిలో పుంలింగ పదాలవలె ఉంటాయి.

ఇకారాంత నపుంసక లింగపదాలు : వారిణః-వారిణోః-వారీణామ్

ఉకారాంత ,, : మధునః-మధునోః-మధూనాం

ఋకారాంత ,, : దాతృణః-దాతృణోః-దాతౄణామ్

హలంత ,, హృదః-హృదోః-హృదామ్

ఈ క్రింది పద్యంలో షష్ఠివిభక్తి పదాలను చూడుడు :

హస్తస్య భూషణం దానం సత్యం కంఠస్య భూషణమ్

శ్రోత్రస్య భూషణం శాస్త్రం భూషణైః కిం ప్రయోజనమ్ ?

ఈ క్రింది వాక్యాలలో షష్ఠీ విభక్తి పదాలను గుర్తించుడు :

1. నగరస్య సమీపే గ్రామః అస్తి. 2. శిష్యః నేతుః రణం వివేశ.

3. లతానాం కాండాః స్పష్టాః. 4. సూర్యస్యతేజసః ప్రభావః మహాన్.

5. గ్రంథా ప్రకాశితా కవ్యోః. 6. గిరాం దేవీ రక్షతు.



పాఠము-7

# సప్తమీ విభక్తి

అకారాంత పుంలింగ పదాలు : వృక్షే-వృక్షయోః-వృక్షేషు

ఇకారాంత ,, : మణౌ - మణ్యోః - మణిషు

ఉకారాంత ,, : శంభౌ - శంభ్వోః - శంభుషు

ఋకారాంత ,, : దాతరి - దాత్రోః - దాతృషు

హలంత ,, : మహతి-మహతోః-మహత్సు

ఆకారాంత స్త్రీలింగ పదాలు ; లతాయాం - లతయోః-లతాసు

ఇకారాంత ,, : మతౌ - మత్యోః-మతిషు

ఈకారాంత ,, : నద్యాం-నద్యోః-నదీషు

ఉకారాంత ,, : ధేనౌ - ధేన్వోః-ధేనుషు

ఊకారాంత ,, : చమ్వాం-చమ్వోః-చమూషు

ఋకారాంత ,, : మాతరి-మాత్రోః-మాతృషు

హలంత ,, : గిరి-గిరోః-గీర్షు

అకారాంత నపుంసకలింగ పదాలన్నీ సప్తమీ విభక్తిలో గూడా పుంలింగ పదాలవలె ఉంటాయి.

ఇకారాంత నపుంసకలింగ పదాలు : వారిణి-వారిణోః-వారిషు

ఉకారాంత ,, : మధుని-మధునోః-మధుషు

ఋకారాంత ,, : దాతృణి-దాతృణోః-దాతృషు

హలంత ,, : హృది-హృదోః హృత్సు

ఈ క్రింది శ్లోకంలో సప్తమీ విభక్తి పదాలను గమనించండి.

ఆపది మిత్ర పరీక్షా శూరపరీక్షా రణాంగణే భవతి.

వినయే వంశపరీక్షా స్త్రియః పరీక్షా తు నిర్ధనే పుంసి.

ఈ క్రింది వాక్యాలలో సప్తమీ విభక్తి పదాలను గుర్తించండి.

1 విద్యాయాం ప్రీతిః కార్యా. 2. వనేషు ఫలాని సన్తి.

3 ఉపాధ్యాయః గ్రామే వసతి. 4. నేతరి ధీరతా వర్తతే.

5. హరిణయోః వ్యాఘ్రః పతతి. 6. మతౌ శక్తిః అస్తి.

ఇట్లే ప్రతి పదానికీ అన్ని విభక్తులను కూర్చి వ్రాయండి.

ఈ క్రింది పదాలకు లింగవచన విభక్తులను చెప్పండి చూద్దాం.

ధనేషు, వ్యాఘ్రః, వృక్షాత్, పచతి, భ్రాత్రోః సుఖేభ్యః, లతాభిః, సౌధస్య, భామాయాః సుఖకరాణి, ధార్మికః, కార్యాలయం, పుమాంసౌ, ఘటయోః, మృది.

పత్రికలు చదువుతూ ప్రతీ పదమూ ఏ లింగమో, ఏ విభక్తో ఏ వచనమో చెప్పడానికి ప్రయత్నిస్తూ ఉండాలి. ఇలా తరుచూ ఏకాగ్రతతో చెయ్యాలి.

సర్వనామ శబ్దాలైన కిం, యత్, సర్వ మొదలైన శబ్దాలకు ప్రాముఖ్యం ఉంది.

పాఠము-8

# మీరూ సంస్కృతం నేర్చుకోండి-2

## వర్తమానకాల రూపములు (Present forms)

సంస్కృతమందలి క్రియలను ధాతువులందురు. ఇవి పరస్మై పది క్రియలని, ఆత్మనేపది క్రియలని, ఉభయపదులని, మూడురకములు.



పరస్మై పది క్రియలకు వర్తమానకాలమున ప్రథమపురుషయందు తి, తః, అన్తి అనియు, మధ్యమపురుష యందు సి, థః, థ అనియు, ఉత్తమపురుషయందు మి, వః, మః అనియు గోచరించును. ఆత్మనే పదులకు తే, ఆతే, అన్తే అని ప్రథమపురుషయందును, సే, ఏథే, ధ్వే అని, మధ్యమపురుషయందును, ఏ, వహే, మహే అని ఉత్తమపురుష యందును ఏకవచన ద్వివచన, బహువచనములయందు కనుపించును. పరస్మైపదుల లక్షణము, ఆత్మనేపదుల లక్షణము ఏ క్రియలయందు కనుపించునో అవియే ఉభయపదులు. భూ అను క్రియకు వర్తమాన కాలమున మూడుపురుషలయందు రూపము లిట్లుండును. ఇది పరస్మై పదిధాతువు.

| | ఏ. | ద్వి. | బ |
|---|---|---|---|
| ప్ర.పు. | భవతి | భవతః | భవన్తి |
| మ. పు. | భవసి | భవథః | భవథ |
| ఉ. పు. | భవామి | భవావః | భవామః |

పరస్మై పది క్రియలకన్నింటికిని యిట్లే రూపములను చెప్ప వలయును.

ఆత్మనే పది క్రియలకు వర్తమానరూపము లిట్లుండును.

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర పు. | ఏధతే | ఏధేతే | ఏధన్తే |
| మ.పు. | ఏధసే | ఏధేథే | ఏధధ్వే |
| ఉ.పు. | ఏధే | ఏధావహే | ఏధామహే |

ఉత్తమపురుషను 1 st Person అనియు. మధ్యమపురుషను 2nd person అనియు, ప్రథమపురుషను 3rd person అనియు ఆంగ్ల

భాషయందు వ్యవహరింతురు. భవతి- He stays భవతః-They two stay, భవన్తి They stay భవసి-you stay భవథః, you stay భవామి-I stay, భవావః we two stay భవామః-we all stay

ఉభయపదులకు రెండు విధములుగనూ రూపములను చెప్పుకొనవచ్చును.

| | | | |
|---|---|---|---|
| ఉ. దా: | శ్రయతి | శ్రయతః | శ్రయన్తి |
| | శ్రయతే | శ్రయేతే | శ్రయన్తే |
| | శ్రయసి | శ్రయథః | శ్రయథ |
| | శ్రయసే | శ్రయేథే | శ్రయధ్వే |
| | శ్రయామి | శ్రయావః | శ్రయామః |
| | శ్రయే | శ్రయావహే | శ్రయామహే. |

సంస్కృతమందు సాధారణముగా అన్ని క్రియలకును రూపములు పై విధముగనే యుండును. వీని సాధారణముగా గాని అన్ని క్రియలకును నోటితో రూపములను చెప్పుట, వ్రాయుట అభ్యసించవలయును. పై క్రియలకు వర్తమాన కాలమందలి ప్రథమపురుషరూపముల పట్టీని చూడుడు.

## ముఖ్యమైన సంస్కృత క్రియలు

భూ:ఉండు : stay, గా:పాడు : sing, గమ్:వెళ్ళు : go, లిఖ్:వ్రాయు write, పఠ్:చదువు : read, దృశ్ : చూచు : see, వద్:పలుకు: say, కథ్:చెప్పు : tell, హస్:నవ్వు : laugh, ప్రచ్ఛ్:అడుగు : ask, స్థా:నిలబడియుండు : stand, చుర్:దొంగిలించు : rob,



ప్రవిశ్:ప్రవేశించు : enter, మ్లై:వాడు : fade, క్రీడ్:ఆడు : play, ధావ్:పరిగెత్తు : run, రుధిర్:అడ్డగించు : prevent, ఆకర్ణ్ : విను listen, ఘ్రా:వాసనచూచు : smell, హన్:చంపు : kill, అవరుహ్:దిగు : Descend, ఐన్:ధ్వనించు- ring, ఉపవిశ్ : కూర్చుండు-sit, శ్రు - విను, listen, పచ్ : వండు ; cook, స్వప్ : శయనించు : sleep, ఏధ్ : వద్ధినొందు - develop, జి : జయించు - conquer, భక్ష్ : తిను - eat, యాచ్ ; యాచించు - beg, నింద్ : నిందించు- blame, కమ్ప్ : కంపించు - shake, ఆగచ్ఛ్ : వచ్చు - come, త్యజ్ : విడుచు, leave, నశ్ : నశించు - destroy, గ్రహ్ : తీసికొను - take, రుదిర్ : ఏడ్చు - cry, జ్ఞా:తెలిసికొను - know, మను : తలచు - think, ఆరుహ్ : ఎక్కు- ascend, పా : పానము చేయు - drink, దా : దానముచేయు - give, కృతీ : ఛేదించు - cut, ఆక్రమ్ : ఆక్రమించు - occupy, షహ్ : సహించు- bear, tolerate, రక్ష్ : రక్షించు - protect, చల్:చలించు-move, చిఞ్ : కోయు - pluck, జీవ్ : జీవించు - live, డీఞ్ : ఎగురు - fly, నీఞ్ : పొందించు - lead, త్రపూష్ : సిగ్గుపడు - shy, ధృ : ధరించు - wear, పుష్ : పోషించు - protect, నట : నటించు - act, పత్ల్ : పడు - fall, ప్రీఞ్ : తృప్తిపఱచు - satisfy బంధ్ : బంధించు - bind, శ్రిఞ్ : ఆశ్రయించు - resort, ష్ణా : స్నానము చేయు - bath, సృజ్ : సృష్టించు - create, స్మృ : స్మరించు - remember, స్పృశ్ : స్పృశించు - touch, ఞిభీ : భయపడు-fear,

పాఠము-9

### పదములు:

యథాపూర్వమ్ : As before, తు, తావత్, అధికృత్య : As for, As to, చ, చ : As well as, అద్యాపి : As yet, కియదపి : At all, భవతు :

So be it, యస్మాత్ : Be that, కించిదన్యదపి : Something more, కిమన్యత్ : What else, అధికాధికమ్ : More and more, కోఽపరః : Who else, కింపునః : How much more, స్థానాంతరాత్ ;Else where, ఉపరిష్టాత్ : From above, దినాద్దినమ్ : From day to day, యత్కించిదపి భవతు : What ever it may be, కిముద్దిశ్య ? ; where about, కేన : Where by, కస్మిన్:Where in, తత్క్షణమేవ:That instant, అత్రాంతరే: In the meanwhile , సవిస్తరమ్ : At long, నోచేత్ : Unless, అముకః : So and so, తావత్ ; As far as, ఏతదవధి : So far. యేనయధా So that, తర్హి, ఏవంచ So then, తత్రైవకుత్రాపి : There about, తతః : There upon, కథమపి : Some how, అధునా : At present, అకస్మాత్:All of a sudden, సర్వస్వమ్ : All in all, యుగపత్ All at once, పునః : ఇతఃపరమ్ : ever more, శశ్వత్ : For యతఃప్రభృతి : ever since, కించ అపిచ : More over.

పాఠము-10

## PRESENT FORMS

భవతి ; He stays ఉన్నాడు, గాయతి : He sings పాడుచున్నాడు, గచ్ఛతి ; He goes వెళ్ళుచున్నాడు, లిఖతి : He writes వ్రాయుచున్నాడు, పఠతి : He reads చదువుచున్నాడు. పశ్యతి : He sees చూచుచున్నాడు, వదతి He speaks మాట్లాడుచున్నాడు, కథయతి : He tells చెప్పుచున్నాడు, హసతి : He laughs నవ్వుచున్నాడు, పృచ్ఛతి : He asks అడుగుచున్నాడు. తిష్ఠతి : He stands నిలచియున్నాడు, చోరయతి : He robs దొంగిలించుచున్నాడు, ప్రవిశతి : He enters ప్రవేశించుచున్నాడు, మ్లాయతి: It fades వాడుచున్నది



ధావతి : He runs పరుగెత్తుచున్నాడు, రుణద్ధి : He prevents అడ్డగించుచున్నాడు, ఆకర్ణయతి He listens వినుచున్నాడు. జిఘ్రతి : He smells వాసనచూచుచున్నాడు, హన్తి : He kills చంపుచున్నాడు, అవరోహతి : He descends దిగుచున్నాడు, నదతి : He rings ధ్వనించుచున్నాడు, ఉపవిశతి : He sits కూర్చొనుచున్నాడు, శృణోతి:He listens వినుచున్నాడు, పచతి : He cooks వండుచున్నాడు, స్వపితి He sleeps నిద్రించుచున్నాడు. ఏధతే : He develops వృద్ధినొందుచున్నాడు. జయతి : He conquers*

అభీక్ష్ణం : మరలమరల, సహ : సాకం : సత్రా ; సమం : సార్ధం : కూడా, తోడ, ధిక్ : (నిందను సూచించేపదం) అథ ; పిమ్మట, శుభం కోసం వాడవచ్చు, ఆమ్ : అవును, yes మా : వద్దు don't చ : కూడా వా ; కూడా, లేదా హ (గతం సూచిస్తుంది). నూనం ; నిశ్చయంగా శశ్వత్ ; మరల మరల, నిత్యం ; ఎల్లప్పుడు భూయః ; మరల చేత్ ; అయితే if హన్త ; అయ్యో ఆహా యావత్: ఏంతవరకైతే, నిశ్చయం. ఎంతైతే, తావత్ : అంతవరకు, అంత. తథాహి ; It is follows, ఖలు ; కదా (కారణాన్ని కూడా సూచిస్తుంది) కిల ; అట (చేసెనట), సుష్ఠు ; సాధు లెస్సగా. స్మ;(భూతకాలాన్ని, సూచిస్తుంది) హే ; భోః : అయ్యా, అయే ; అయి ; ఓయీ (ప్రేమగపిలుచుట). తు ; కాని, కింతు ; కాని, పరంతు ; కానీ అపి ; కూడా, అపితు : కానీ ; ఇంకా, హి ; నిశ్చయంగా, ను ; (సందేహాన్ని సూచించును), అపి; ననుా, కిం, కచ్చిత్ అనునవి ప్రశ్నవాక్యాలముందు సాధారణంగా ప్రయోగింపబడుతాయి. నానా;బహుధా;అనేక విధములుగా, స్వతః : స్వయంగా, పరతః ఇంకొకదానిచే, వేరొకచోటనుండి, ఇతః ఇటువైపు;

అముతః బహుతః : అనేక వైపులనుండి, పరితః ; సర్వతః ; నలు వైపులా, అభితః ; ఉభయతః ; రెండువైపులా, ఇహ ; ఇక్కడ, బహుత్ర;సర్వత్ర;అనేకచోట్ల. సద్యః ; వెంటనే, అదేరోజు, పరుత్ ; గడచిన సంవత్సరం, పరారి ; గత సంవత్సరానికి వెనుక సంవత్సరం, ఐషమః ; ఈ సంవత్సరము. పరేద్యవి ; తరువాతరోజు పూర్వేద్యుః; ముందురోజు అన్యేద్యుః ; మఱియొకరోజు, ఉభయేద్యుః ఉభయద్యుః; రెండురోజులయందు, యథా ; ఏ విధముగా, తథా : ఆ విధముగా, పురః : పురస్తాత్ : ఎదురుగా, అధరేణ ; అధః : అపరస్తాత్ ; క్రిందుగా, దక్షిణేన దక్షిణతః: దక్షిణంగా ఉత్తరేణ : ఉత్తరతః: ఉత్తరంగా, పశ్చాత్ ; వెనుకగా ఉపరి ; ఉపరిష్టాత్ : పైన, పూర్వేణ ; తూర్పుగా, అపరేణ ; అవతల, దక్షిణాహి : దక్షిణా: దక్షిణదిక్కుగా, ఉత్తరాహి : ఉత్తరా : ఉత్తరదిక్కుగా, విశ్వేషక్ ; To a man, ఇతస్తతః ; to and fro, ఏతావత్పర్యంతం : So far So long, ఇత్యాది ; ect or So forth, ఏవం తర్హి : So then, అపితావత్ ; So much, ఇపది ; Anon, ముహుర్ముహుః : ever and anon, యథా ; తథాహి ; As for Instance.

పాఠము-11

## అసమాపక క్రియలు (INFINITIVE VERBS)

సమాప్తిని పొందని క్రియలను అసమాపక క్రియలందురు. వెళ్లి, వచ్చి, తిని, చదివికొని మొదలగునవి యిందుకు దాహరణములు. ఆంగ్లమందు after going, or having gone అనియు, after plucking or having plucked అనియు చెప్పుదురు. సంస్కృతమున వెళ్లి, అనుదానికి గత్వా అని సంగమ్య అనీ, చదివి అను దానికి పఠిత్వా అని ప్రపఠ్య అని రెండు రెండు రూపములుండును. మరల మరల వెళ్లి అనుదానికి గామం గామం అనీ [గమంగమం], మరల



మరల చదివి అను దానికి పాఠం పాఠం అనియు అందురు. ఈ క్రింది పట్టీద్వారా అసమాపక క్రియలను (Infirative Verbs) ను తెలిసికొన వచ్చును.

సంస్కృతమున అసమాపక క్రియలకు త్వా అనిగాని య అని గాని చివర వచ్చును.

భూత్వా ; అయి, ఉండి గీత్వా ; పాడి, గత్వా ; వెళ్లి, లిఖిత్వా ; వ్రాసి. పఠిత్వా ; చదివి, దృష్ట్వా ; చూచి, వదిత్వా ; పలికి, కథయిత్వా ; చెప్పి, హసిత్వా ; నవ్వి, పృష్ట్వా ; అడిగి, స్థిత్వా ; ఉండి చోరయిత్వా ; దొంగిలించి, ప్రవిశ్య ; ప్రవేశించి, మ్లిత్వా; వాడిపోయి, క్రీడిత్వా; ఆడి, ధావిత్వా ; పరుగెత్తి, రుద్ధ్వా ; అడ్డగించి, ఆకర్ణ్య ; విని, ఘ్రాత్వా ; వాసనచూచి, హత్వా ; చంపి, అవరుహ్య ; దిగి, నదిత్వా : మ్రోగి, ధ్వనించి, ఉపవిశ్య: కూర్చొని, శ్రుత్వా: విని, పక్త్వా: వండి, స్వపిత్వా: నిద్రించి, ఏధిత్వా: వృద్ధినొంది జిత్వా ; జయించి, భక్షయిత్వా: తిని, యాచయిత్వా: యాచించి, నిందిత్వా: నిందించి, కంపిత్వా : కంపించి, ఆగత్య : వచ్చి, త్యక్త్వా : విడచి, నష్ట్వా. నశించి, గృహీత్వా: తీసికొని, జ్ఞాత్వా: తెలిసికొని, మత్వా: తలచి, ఆరుహ్య: ఎక్కి, పీత్వా: త్రాగి, దత్త్వా: ఇచ్చి: కృంతిత్వా; ఛేదించి ఆక్రమ్య : ఆక్రమించి, సహిత్వా: సహించి, రక్షిత్వా : రక్షించి, చరిత్వా:కదలి, అవచిత్య: కోసి: జీవిత్వా: జీవించి: ఉడ్డీయ: ఎగిరి: నీత్వా: నడిపి, త్రపిత్వా: సిగ్గుపడి, ధృత్వా: ధరించి, పోషయిత్వా: పోషించి, నటిత్వా: నటించి, పతిత్వా: పడి, ప్రీణిత్వా: తృప్తి పఱచి, బద్ధ్వా: బంధించి: శిత్వా: ఆశ్రయించి, స్నాత్వా ; స్నానముచేసి,

స్పృష్ట్వా: స్పృశించి, స్మృత్వా : స్మరించి, స్పృష్ట్వా ; తాకి, భీత్వా: భయపడి.

సంస్కృత భాషయందు వివిధ అర్థములనిచ్చు ఉపసర్గలు గలవు. వీనినే ప్రాదులు అందురు. ఈఉపసర్గలను క్రియలకుముందు చేర్చుదురు. ఇవి సందర్భాను సారముగా రకరకములైన అర్థముల నిచ్చును. ఈ ఉపసర్గలు త్వా అను పై రూపములకు ముందు చేర్చినపుడు ఆ పదము చివరనుండు త్వా అనునది పోయి యగా మారును. ఉదా॥ సం + గత్వా ; సంగమ్య, సం + స్పృష్ట్వా॥ సంస్పృజ్య. ప్ర, పర, అప, సమ్, అను అవ, నిస్, నిర్, దుస్, దుర్, వి. ఆఙ్, ని, అధి, అపి, అ , సు, ఉత్, అభి, ప్రతి, పరి, ఉప, అనునవి ఉపసర్గలు. పై ప్రత్యయాంత రూపములందు కొన్ని పదములు ఉపసర్గలతోనే ప్రసిద్ధములుగావున అట్లే ఉదహరింపబడినవి. ఇవన్నీ కంఠస్థంచేయండి.

### పాఠము-12

## ఉపకరణాని : పనిముట్లు

చమసః : చెంచా, కర్షణీ ; స్క్రూ, కర్షణీచోదకః : స్క్రూడ్రైవరు ఆసనం; పీట. చషకః : గ్లాసు, భాజనమ్ : గిన్నె, భృంగారుకః : వంచుకొనెడు కాడగలగిన్నె, కటాహః : గుండిగ, సమ్మార్జనీ: చీపురు, యవనికా: తెర, ఘరట్టః : తిరగలి, కటః : చాప, బహుచ్ఛిద్రమ్ : జల్లెడ, ఉపానహౌ : చెప్పులు, పాదత్రాణౌ : బూట్లు, పాదుకే : సాదాచెప్పులు, శూర్పః: చేట, కందుః: పెనము, కంభీ:గరిటె, శరావః: మూకుడు, దర్వీ: తెడ్డు, కండోలః: గంప, కంసః: కంచము, ముసలః: రోకలి, దృషత్పుత్రః: సన్నికల్లు, పేషణీః: పొత్రము, తాళకం:



తాళము, ఉద్ఘాటకః: తాళంచెవి, హలః : నాగలి, లవిత్రమ్: కొడవలి. ఖనిత్రమ్: పార, సూచీ : సూది, బృహత్సూచీ : దబ్బనము, ఆరా : చెప్పులుకుట్టుసూది, యూషాః కవ్వము, ఘటః : కుండ, మంజూషా , పెట్టె, శకులా : వక్కను కత్తిరించేకత్తి, కర్తరీ : కత్తెర, పరిఘః : గొడ్డలి, నికషః : ఒరిపిడిరాయి, భస్త్రా : తోలుతిత్తి, తూలికా: కుంచె, గశికా : మేకు, వరాహకూర్చమ్ : నగలుతుడిచేబ్రష్, లోహపత్రమ్ : రేకు, ఆహావః : నీటితొట్టె, ఉన్మాథః : గాలము, కుహానమ్ : గాజు పాత్ర, నిశ్శ్రేణికా : నిచ్చెన, క్రకచః : రంపము, ఉలూఖలమ్ : రోలు, కరండికా : పూలబుట్ట, గళంతికా : చెంబు, ఆవర్తనీ : గరిటె, ముద్గరః : సుత్తి, ఖడ్గః : కత్తి, అర్గలా : గడియ, కుద్దాలః.గునపము, అశ్మదారణమ్ : ఉలి, త్రిపాత్ : ముక్కాలిపీట, ధృతిః : సంచి, కరధృతిః : చేతిసంచి, వృశ్చనః : ఆకులనుతుంచే ఇనపవస్తువు, ఛురికా : చాకు, శాణయన్త్రమ్ : పదునుపెట్టెయంత్రం, నాగదంతః : కొక్కెము, అంబుసేచనీ : నీటిబొక్కెన, విషాణమ్ : జాలిగోలెం, శిఖాతరుః ; దీపపుసమ్మె, ఆఘర్షః: కుంచె, ఆనకమ్ : తప్పెట, ఘటీయన్త్రమ్ ; ఏతాము, పత్రం : card, ధూమనాళః : చిమ్నీ, హసన్తీ : పొయ్యి, చుల్లీ : కుంపటి, అంగారధానీ : పెద్దపొయ్యి, వాయుహసన్తీ : గ్యాస్ పొయ్యి, విద్యుత్పాచకం: : కుక్కరు, పుటగ్రీవః ; జాడీ, భ్రాష్టం ; బాణలి, సిక్థకదీపః : మైనపువత్తి, లేఖినీ ; పెన్ను, కఠినికా:బలపము, సంఘర్షణీ : రబ్బరు, కృష్ణలేఖినీ : పెన్సిల్, ఖటికా : చాక్‌పీస్, పుస్తకం : పుస్తకము, మార్జనీ ; డస్టరు, కృష్ణఫలకః ; బ్లాక్‌బోర్డు, కవాటః : తలుపు ద్వారమానం ; గడప, గవాక్షం:కిటికీ, ఉపధానం ; దిండు, శిక్యం : ఉట్టి, గృహం : ఇల్లు, సౌధః : మేడ, అంగనం : ముంగిలి, (వరండా) ద్వారం : ద్వారము, పతద్గ్రిహః : ఉమ్మివేయు

పెట్టె లేదా చెత్తబుట్ట, కశా ; కొరడా, ఉద్వర్తనీ : అట్లకాడ, వాగురా: వల, దీపః ; దీపము, విద్యుద్దీపః ; విద్యుద్దీపము, కరదీపికా ; ఓవిటీ, అగ్రిధిః ; బూజాకళ్ళు, కాచచషకః ; పింగాణీచిప్ప.

## పాఠము-13

## POTENTIAL MOOD

సంస్కృతమున చేయవలెను, తినవలెను, చదువవలెను అను అర్థమున తవ్య అను ప్రత్యయము ప్రతి క్రియకు చేరును. వీనిని మూడు పురుషలయందు మూడువచనములయందును, అన్ని లింగములయందును మార్పులేక వాడవచ్చును వీని యందుగల కర్తృపదమునకు (Subject) మాత్రము తృతీయావిభక్తి వచ్చును.

గంతవ్యం, భోక్తవ్యం, పఠితవ్యం

మయా గంతవ్యం - నేను వెళ్ళవలెను. I should go

(ఉత్తమపురుష 1st person)

త్వయా భోక్తవ్యం - నీవు తినవలెను. You should eat

(మ. పు. 2nd person) It shonld be eaten by you

తేన పఠితవ్యం - అతడు చదువవలెను. He should read

It should be read by him.

ఈ క్రింది పట్టీని కంఠస్థము చేయవలయును :

భవితవ్యం - ఉండవలెను. గాతవ్యం - పాడవలెను. గంతవ్యం - వెళ్లవలెను. లిఖితవ్యం - వ్రాయవలెను. పఠితవ్యం-చదువవలెను. ద్రష్టవ్యం - చూడవలెను. వదితవ్యం-మాట్లాడవలెను. కథితవ్యం-చెప్పవలెను. హసితవ్యం - నవ్వవలెను. ప్రష్టవ్యం-అడుగవలెను. స్థాతవ్యం - ఉండవలెను. చోరితవ్యం - దొంగిలించవలెను. ప్రవేష్ట



వ్యం - ప్రవేశింపవలెను. మ్లాతవ్యం - వాడిపోవలెను. క్రీడితవ్యం - ఆడవలెను. ధావితవ్యం - పరుగెత్తవలెను. రోధితవ్యం - అడ్డగించవలెను. ఆకర్ణయితవ్యం - వినవలెను. ఘ్రాతవ్యం - వాసనచూడవలెను. హన్తవ్యం - చంపవలెను. అవరోహితవ్యం - ఎక్కవలెను. నతవ్యం - ధ్వనింపవలెను ఉపవేష్టవ్యం - కూర్చొనవలెను. శ్రోతవ్యం - వినవలెను. పక్తవ్యం - వండవలెను. స్వపితవ్యం - నిద్రించవలెను. ఏధితవ్యం - వృద్ధిపొందవలెను. భేత్తవ్యం-భేదింపవలెను భక్షితవ్యం-తినవలెను. యాచితవ్యం-అడుగవలెను. నిందితవ్యం-నిందింపవలెను. కంపితవ్యం-కంపించవలెను. ఆగన్తవ్యం-రావలెను. త్యక్తవ్యం - విడచిపెట్టవలెను. నష్టవ్యం - నశించవలెను. గృహీతవ్యం - తీసికొనవలెను. రోదితవ్యం - ఏడ్వవలెను. జ్ఞాతవ్యం - తెలిసికొనవలెను. మంతవ్యం - తలువవలెను. ఆరోహితవ్యం - ఎక్కవలెను. పాతవ్యం - త్రాగవలెను. దాతవ్యం - ఇవ్వవలెను. కృంతితవ్యం - ఛేదింపవలెను. ఆక్రమితవ్యం - ఆక్రమింపవలెను సోఢవ్యం - సహింపవలెను. రక్షితవ్యం - రక్షింపవలెను చలితవ్యం - చలింపవలెను. ఛేతవ్యం - కోయవలెను. జీవితవ్యం - జీవింపవలెను డయితవ్యం - ఎగురవలెను. నేతవ్యం - తీసికొనివెళ్ళవలెను. త్రపితవ్యం - సిగ్గుపడవలెను. ధర్తవ్యం - ధరింపవలెను. పోషితవ్యం - పోషింపవలెను. నటితవ్యం - నటింపవలయును. పతితవ్యం - పడవలెను. ప్రీతవ్యం - తృప్తిపడవలెను బంధితవ్యం - బంధింపవలెను. శ్రయితవ్యం - ఆశ్రయింపవలెను. స్నాతవ్యం - స్నానము చేయవలెను. స్రష్టవ్యం - సృష్టింపవలయును. స్మర్తవ్యం - స్మరింపవలయును. స్ప్రష్టవ్యం - తాకవలయును. భేతవ్యం - భయపడవలెను.

## పాఠము-14

ఈ క్రియల యందు న్యాయముగా చదువబడవలెను. అని కర్మార్థమే చెప్పవలయును కొన్ని అకర్మకధాతువులగుటచేతను, తెలుగులో కర్త్రర్థక ప్రయోగా లెక్కువగా ఉండడం వలన కర్త్రర్థంలో వ్రాయబడ్డాయి చదువవలెను, వ్రాయదగినది, వ్రాయబడవలెను. మొదలగు పై అర్థములలోనే పఠనీయమ్, గమనీయమ్, ఘోషణీయమ్, యాచనీయమ్, అను విధముగా అనీయ అని క్రియ తరువాత చేర్చి కూడా వాడవచ్చును.

భూతకాలార్థమున క్రియలను ఎట్లువాడవచ్చునో గత పాఠముల యందు నిరూపించితిమి. అట్లుగాక క్త, క్తవత్ ప్రత్యయాంతరూపము లను కర్తకు (Su ,iject) విశేషణముగా వాడి వ్యవహారమును కొన సాగింపవచ్చును. ఇది మిక్కిలి సులభమైన పద్ధతి. సాధారణముగా సంస్కృతభాష యందు క్రియలను వాడుటయే కష్టము. "సర్వేనష్టాః తిఙన్తప్రక్రియాయాం" అనిగలదు. అనగా పాఠములను శ్రద్ధగా చదువుకొనుచున్న విద్యార్థులు సైతము గురువుగారు క్రియలను బోధించునపుడు ఇబ్బందిపడిరట. కావున భూతకాలమునందలి వెనుక పట్టీలయందలి క్రియలను వాడనక్కరలేకయే ఈ క్రింది పదములతో సులభముగా మనము మాట్లాడుకొనవచ్చును. అది ఎలాగో వివరిస్తాను.

ప్రథమపురుష, మధ్యమపురుష, ఉత్తమపురుషయని మూడు పురుషలున్నవి గదా. ప్రథమ పురుషయందు He or She అనునది "వాడు లేక ఆమె లేక అది" అనునది కర్త ఇవి ఏకవచనము నందు డును. ద్వివచనమున They two, అనునది, బహువచనమున They all అనునవి కర్తలు. కావున, సః పఠతి ; He reads, తౌ పఠతః They two read, తే పఠన్తి ; They read, అని కర్త ఏ పురుష



ఏ వచనమునందుండునో క్రియను అదే పురుష అదే వచనమున వాడ వలయును. మధ్యమ పురుషయందు.

త్వం పఠసి : You read, యువాం పఠథః ; You two read, యూయం పఠథ ; You all read అని ప్రయోగములుండును ఉత్తమ పురుషయందు, అహం పఠామి : I read. ఆవాం పఠావః : We two read, వయంపఠామః : We all read, అని వాక్యములుండును.

ఇచట ఒక విషయమున్నది. ప్రథమయనగా మొదటి అని భావింతురు. అట్లు భావింపరాదు. అట్లు తలచినచో ప్రథమ పురుష యనగా 1st person అని చెప్పవలసి వచ్చును. అది సరికాదు. 1st person అనగా ఉత్తమపురుష, మధ్యమపురుష యనగా 2nd person, ప్రథమ పురుష యనగా 3rd person అగును. ఈ విషయ మును అంగ్లభాష తెలిసినవారు గుర్తుంచుకొనవలయును.

పఠితవాన్ అనగా చదివినవాడు అని అర్థము. I, You, He అను కర్తలున్నపుడును ఈ క్రియను మార్చకయే వాడవచ్చును. ఇది మాట్లాడుటకు ఎంతయో సుళువైన పద్ధతి. ఉదాహరణకు పఠితవాన్: అను పదమునే తీసికొందము.

క్రియతో ప్రయోగము ;

సః అపఠత్ He read, త్వం అపఠః You read, అహం అపఠమ్ I read, ఆంగ్లమున read, అను క్రియ మార్పు చెందకయే యుండుట సుఖకరముగదా. సంస్కృతమున పురుష (కర్మ) మారి నంతనే క్రియయు మారుచున్నది. గమనింపుడు, ఇది కొంచెము కష్టముకాదా యనినచో నిజమేయగును. కాని పై అర్థములలోనే యీ క్రింది సుళువైన మార్గమును చూడుడు.

సః పఠితవాన్ He read
త్వం పఠితవాన్ You read
అహం పఠితవాన్ I read
} Past tense

ఈ వాక్యములలో పఠితవాన్ అనునది మారుటలేదు. ఈ గ్రంథముతో బాటు శబ్దమంజరి యందలి పట్టీలను కంఠస్థము చేసినచో భాష సుఖవుగా వచ్చివేయును. ఈ పఠితవాన్ అనునది Singular. పఠితవన్తౌ అనునది Dual, పఠితవన్తః అనునది Plural అగును. ఈశబ్దములను శబ్దమంజరి యందలి ధీమత్ శబ్దమువలె చెప్పవలెను. పఠితవన్తౌ, పఠితవన్తః అను ఏక ద్వి బహువచనముల రూపములను గుర్తుంచుకొనవలయును ఇట్లే పట్టీయందలి రూపములకును అగును. ఈ మార్పులను గుర్తుంచుకొని భూ క్రియకుగల వర్తమాన, భవిష్యత్ కాలములందలి రూపములను కంఠస్థము చేసినచో అతిసుఖవుగా సంస్కృతమున సంభాషించుకొనుచూ వ్యవహారము సాగింపవచ్చును. చూడుడు....

పాఠము - 15

## PRESENT TENSE

అతడు చదువుచున్నాడు సః పఠితవాన్ భవతి He reads

వారిద్దరూ చదువుచున్నారు తౌ పఠితవన్తౌ భవతః They two read

వారు చదువుచున్నారు. తే పఠితవన్తః భవన్తి They read

నీవు చదువుచున్నావు త్వం పఠితవాన్ భవసి You read

మీరిద్దరూ చదువుచున్నారు యువాం పఠితవన్తౌ భవథః
You two read

మీరందరూ చదువుచున్నారు యూయం పఠితవన్తః భవథ
You all read



నేను చదువుచున్నాను అహం పఠితవాన్ భవామి I read

మేమిద్దరము చదువుచున్నాము ఆవాం పఠితవన్తౌ భవావః
We two read

మేమందరము చదువుచున్నాము వయం పఠితవన్తః భవామః
We all read

## PAST TENSE

అతడు చదివెను సః పఠితవాన్ He read

వారిద్దరూ చదివిరి తౌ పఠితవన్తౌ They two read

వారందరూ చదివిరి తే పఠితవన్తః They read

నీవు చదివితివి త్వం పఠితవాన్ You read

మీరిద్దరూ చదివితిరి యువాం పఠితవన్తౌ You two read

నేను చదివితిని అహం పఠితవాన్ I read

మేమిద్దరము చదివితిమి ఆవాం పఠితవన్తౌ We two read

మేమందరము చదివితిమి వయం ప తవన్తః We all read

## FUTURE TENSE

అతడు చదువగలడు సః పఠితవాన్ భవిష్యతి He will read

వారిద్దరూ చదువగలరు తౌ పఠితవన్తౌ భవిష్యతః
They two will read

వారందరు చదువగలరు తే పఠితవన్తః భవిష్యన్తి
They will read

నీవు చదువగలవు త్వం పఠితవాన్ భవిష్యసి You will read

మీరిరువురు చదువగలరు యువాం పఠితవన్తౌ భవిష్యథః

You two will read

మీరందరూ చదువగలరు యూయం పఠితవన్తః భవిష్యథ

You all will read

నేను చదువగలను అహం పఠితవాన్ భవిష్యామి I will read

మేమిరువురము చదువగలము ఆవాం పఠితవన్తౌ భవిష్యావః

We two will read

మేమందరము చదువగలము వయం పఠితవన్తః భవిష్యామః

We all will read

పై పట్టీల యందు సంస్కృత వాక్యములలో మూడంశములు గలవు. 1) Subject (వాడు నీవు నేను మొదలగునవి 2) చెప్పదలచు కొన్న క్రియారూపము పఠితవాన్ మొ॥ 3) భూ అను క్రియయొక్క రూపము. ఇట్లు మూడంశములతో మూడు కాలములందు అనేక వాక్యములను నిర్మింపవచ్చును. Past tense వాక్యములలో మాత్రము భూ అను క్రియయొక్క రూపమును వాడనవసరములేదు. ఇచ్చట రెండంశములు మాత్రమే యుండును. ముఖ్యమైన క్రియలకు గల ఈ క్రింది రూపములను కంఠస్థము చేయవలయును పఠితవాన్ అను పదమునకు మూడు లింగములయందు మూడు వచనముల యందు రూపములను దిగువనిచ్చిన పద్ధతిలో గుర్తుంచుకొనుడు.

పాఠము - 18

| | Singulai | Dual | Plural |
|---|---|---|---|
| Masculine Gender - | పఠితవాన్ - | పఠితవన్తౌ - | పఠితవన్తః |
| Feminine Gender - | పఠితవతీ - | పఠితవత్యౌ - | పఠితవత్యః |
| Neuter Gender - | పఠితవత్ - | పఠితవతీ - | పఠితవన్తి |



ఇట్లే గతవాన్ (M) గతవతీ (F) గతవత్ (N) అని రూపములనూహించునది. సాగతవతీ, She went. సాగతవతీ భవిష్యతి She will go. సాగతవతీ భవతి She goes

సః : He సా : She తత్ : It That తౌ: They two తే : They two (girls) తే : Those two తే : They తాః : They (girls) తాని : Those all.

పఠితవాన్ అని పుంలింగంలోను, పఠితవతీ అని స్త్రీ లింగం లోను, పఠితవత్ అని నపుంసకలింగమందు రూపములెట్లు చెప్పితిమో అట్లే ఈ క్రింది పదములకుగూడ అన్ని వచనముల యందును నోటితో చెప్పుటకు అభ్యసింపవలయును.

ఈ క్రింది పట్టీని కంఠస్థము చేయుడు.

భూతవాన్-భూతవతీ భూతవత్. గీతవాన్-గీతవతీ-గీతవత్. గతవాన్-గతవతీ-గతవత్ లిఖితవాన్ - లిఖితవతీ - లిఖితవత్. దృష్టవాన్ - దృష్టవతీ - దృష్టవత్. కథితవాన్ - కథితవతీ - కథితవత్. స్థితవాన్ - స్థితవతీ - స్థితవత్. హతవాన్ - హతవతీ - హతవత్. భుక్తవాన్ - భుక్తవతీ - భుక్తవత్. జితవాన్ - జితవతీ - జితవత్. భీతవాన్ - భీతవతీ - భీతవత్. స్నాతవాన్ - స్నాతవతీ - స్నాతవత్.

ఇదే విధముగా మిగిలిన క్రియలకు గల రూపములను నోటితో చెప్పుచూ అభ్యసింపుడు.

పై పదాలలో సాధారణంగా నపుంసకలింగ పదాలను వాడవలసిన అవసరంరాదు. వాటిని వదలి కూడా మాట్లాడుకోవచ్చు ఎందుకంటే లోకంలో పురుషుడో స్త్రీయో కర్త అగును. అయితే మనస్సే అక్కడకు వెళ్ళింది అనాలనుకోండి అప్పుడు వెళ్ళింది అనే అర్థంలో

గతవత్ అనే నపుంసకలింగపదమే వాడాలి. మనఃఏవగతవత్ అని చెప్పాలి. అయితే ఇటువంటి సమయాలలో నేను తలచాను అని మార్చి చెప్పినా సరిపోతుంది అలా మార్చుకోండి. అప్పుడు నపుంసక లింగపదాలను వాడవలసిన అవసరం ఉండదు. ఉదాహరణకు అజ్ఞానం చేయించింది అనాలనుకోండి. అప్పుడు నాకు తెలియలేదు. అందుకే చేసాను. మొదలగు రీతుల్లో విడగొట్టి మాట్లాడండి. తేలికగా ఉంటుంది. పై పట్టీల సహాయంతో వాక్యాలు నిర్మించేటప్పుడు ఈ నియమాలు గుర్తుంచుకోండి.

1. వాక్యాలలో కర్తను, మిగిలిన క్రియాభాగాన్ని విడివిడిగా గుర్తించండి.

2. కర్తను చెప్పేపదం ఏలింగమో, ఏవచనమో గుర్తించండి.

3. కర్తను చెప్పే ఆ అర్థంగల పదం సంస్కృతంలో ఏదో పదాలను చూడండి.

4. ఆ పదానికి ఆ వచనం ఎలా ఉంటుందో విభక్తులను దృష్టిలో ఉంచుకొని చెప్పండి.

5. అది ఏలింగమో చూడండి.

6. ఆ లింగం, ఆ వచనంలో కర్తను వాడండి.

7. క్రియాపదం భూతకాలంలో ఉందా, వర్తమానకాలంలో ఉందా, భవిష్యత్కాలంలో ఉందా అని చూడండి.

8. ఆ క్రియాపదాన్ని కర్తఉండే లింగంలో, వచనంలో వాడండి. అంతే వాక్యం పూర్తవుతుంది.



పై నియమాలను పాటిస్తూ ఈ క్రింది వాక్యములను సంస్కృతంలోకి మార్చండి.

1. పులకేశి హర్షవర్ధనుని జయించెను. 2. బుద్ధుడు సంసారమును త్యజించెను. 3. ఇద్దరు స్త్రీలు పువ్వులను తీసికొనిరి.

అత్ర : ఇక్కడ, అదః ; ఇది, అసౌ ; వాడు, ఈమె అమ్ ; అవును, ఇదమ్ : ఇది, ఇయమ్ : ఈమె, ఇది, ఈ, ఇహ : ఇక్కడ, ఏషః : వీడు, ఏషా ; ఈమె, కః : ఎవడు, ఏతత్ : ఇది, కదా : ఎప్పుడు, కా : ఏవతె, కిం ; ఏమి, కిమర్థమ్ ; ఎందుకు. కుత్ర: ఎక్కడ, తత్ర : అక్కడ, తథా : ఆరీతిగా, తదా : అప్పుడు, తు : కాని, న : లేదు, కాదు, యథా : ఏరీతిగా అయితే, యదా : ఎప్పుడైతే, వా : లేక, సర్వత్ర : అంతటా, సర్వదా : ఎల్లప్పుడు. హి : నిశ్చయముగా.

6. వాక్యంలో యదా వస్తే తదా, యః వస్తే సః, యా వస్తే సా, యత్ వస్తే తత్, యథా వస్తే తథా వస్తాయి.

ఉదా : యదారామః అగచ్ఛత్ తదా ఏతదభూత్.

## పాఠము - 17

## రంగులు Colours

అరుణః ; Light Red అపాండుః : పాలిపోయినరంగు Pale ఈషద్ధూమ్రః ; Purple కడారః : Reddish Brown కర్బురః : mixed with all colours. కృష్ణః:Black. జపావర్ణః:Rose colour. తామ్రః : Thick Red. ధూమ్రః ; Black mixed with Red. నీలః ; Blue పాటలః : Pink పాండురః:Yellow white పింగలః ;

Light Yellow పిచ్ఛిలః : Orange పిశంగః : Brown రక్తః:Red లోహితః : Dark Red శుక్లః : White శోణః : Pink హరితః : Green.

ఇవి మూడు లింగాలలోనూ ఉంటాయి. ఆ వస్తువును బట్టి లింగం చెప్పాలి.

ఉదా : శుక్ల - శుక్లా - శుక్లమ్.

NUMBERS సంఖ్యాః

| M | F | N | |
|---|---|---|---|
| ఏకః | ఏకా | ఏకమ్ | [One] |
| ద్వౌ | ద్వే | ద్వే | [Two] |
| త్రయః | తిస్రః | త్రీణి | [Three] |
| చత్వారః | చతస్రః | చత్వారి | [Four] |

పంచ అను పదము మొదలు అన్ని సంఖ్యలూ మూడు లింగముల యందు సమానముగనే యుండును. విశేషణ మనగా విశేషమును తెలుపునది. విశేష్యమనగా విశేషణముచే తెలియబడిన విశేషము గలది. వాక్యముల యందు విశేషణములు, విశేష్యము ఉండును. విశేషణము ఏ లింగము, ఏ వచనము, ఏ విభక్తి యందుండునో విశేషణములను అదే లింగము అదే వచనము అదే విభక్తి యందు ప్రయోగించాలి.

ఉదా:- 1. రామః ఏకః. 2. లక్ష్మీపార్వత్యౌ ద్వే 3 తిస్రః కాంతాః 4. చత్వారి ఫలాని. పంచ పురుషాః, పంచ స్త్రియః పంచ ఫలాని మొదలైన (5thto) అంకెలన్నీ అన్ని లింగాలలోను సమానంగానే ఉంటాయి.



షట్ - 6 సప్త - 7 అష్టౌ - 8 నవ-9 దశ-10 ఏకాదశ-11 ద్వాదశ-12 త్రయోదశ-13 చతుర్దశ-14 పంచదశ-15 షోడశ-16 సప్తదశ-17 అష్టాదశ-18, వింశతిః-20 ఏకవింశతిః-21 ద్వావింశతిః-22 త్రయోవింశతిః-23 చతుర్వింశతిః-24 పంచవింశతిః-25 షడ్వింశతిః-26 సప్తవింశతిః-27 అష్టావింశతిః-28 త్రింశత్-30 చత్వారింశత్-40 పంచాశత్-50 షష్టిః-60 సప్తతిః-70 అశీతిః-80 నవతిః-90 శతమ్-100 సహస్రం-1000 అయుతమ్-10,000 లక్షః-1,00,000 కోటిః-1,00,000,00 దశకోటిః-10,00,000 మిగతావి ఇలా చెప్పాలి. శతకోటిః, సహస్రకోటిః

ఇలాగే ఏక, ద్వి, త్రయః, చతుర్, పంచ, షట్, సప్త అష్ట, చేర్చి క్రమంగా పదాలు చెప్పాలి.

19, 29, 39, 49, 59, 69, 79, 89, 99 పదాలకు ఒకటి తక్కువ 20, ఒకటితక్కువ 30 అర్థాలువచ్చేలాచెప్పాలి అంటే ఏకోన అనివ్రాసి దానితరువాత, తరువాతవచ్చే అంకెపేరు వ్రాయాలి. 19 అనాలంటే ఏకోన అని, తరువాత 20ని చెప్పే వింశతిః అనే పదం చేర్చాలి, ఏకోన వింశతిః ఏకోన త్రింశత్, ఏకోన చత్వారింశత్ మొ॥.

రుచయః (రుచులు)

మధురం : తీపి, ఆమ్లమ్ : పులుపు లవణమ్ : ఉప్పు కటు : కారము, కాషాయమ్ : వగరు, తిక్తమ్ : చేదు. తియ్యనిది, పుల్లనిది అని చెప్పాల్సివస్తే ఆవస్తువును తెలిపేపదం ఏలింగంలో ఉంటుందో ఈ పదాన్ని కూడా ఆ లింగంలో వాడాలి. పుంలింగాలలో ఈ పదాలకు విసర్గ (ః) చేరుతుంది స్త్రీలింగాలలో అకారాంతాలు ఆకారాంతాలుగా, ఉకారాంతాలు ఈకారాంతాలుగా మారుతాయి. ఉదా : ఆమ్లా, కట్వీ, నపుంసక లింగాలలో పట్టీలలోలాగే ఉంటాయి.

పాఠము-18

# పదాని

కుంతీ : కొంతి దీపనీ:వాము జాతీఫలమ్:జాజికాయ సురభిత్వక్: దాల్చినచెక్క కస్తూరీ : కస్తూరి, ఖదిరసారః : కవిరి పారదః : పాదరసము, సిక్థకమ్ మైనము, మయూరకమ్ : మైలతుత్థము, సింధూరమ్ : సింధూరము, రసపుష్పమ్ : వెలిగారం, ధూమోత్థః : నవాసారము, ఉద్దీప్రం : గుగ్గిలము అశ్మసారః : శిలాజిత్తు, లాక్షా : లక్క, శిగ్రుః : ములగ, శికాఫలం : శీకాయ.

పాఠము-19

# విలాసవస్తూని

కంకతికా : దువ్వెన, దర్పణం : అద్దము, తిలకం : బొట్టు, కుంకుమం : కజ్జలం : కాటుక, ముఖచూర్ణం : పౌడరు, హిమకం : స్నో, హిమాంబు : పన్నీరు, పటవాసః : మైపూత, వలయం : గాజు, అంజనశలాకా : కాటుకపుల్ల, అమ్లావం ; గోరింటాకు, మేఖలా : వడ్డాణం, హారః : ముత్యాలదండ, చందనం : గంధం, కర్పూరం : కర్పూరము, కేశతైలం : తలనూనె, శిరస్త్రాణం : టోపి, అలకాః : ముంగురులు, అంగుళీయకం : ఉంగరం, నఖలు, గోళ్ళనుకత్తిరించేది, నఖరంజనీ : గోళ్ళరంగు, దంతచూర్ణం : పళ్ళపొడి, హంసకః:అందె, పాదోర్మికాః : మట్టెలు, మంగలసూత్రం : మంగళసూత్రం, కర్ణికా : జూకా, లోలకు, కుండలం : కుండలము, గ్రైవేయకం ; నెక్లెస్, అవగుంఠనం ; మేలిముసుగు, దంతపిష్టం : టూత్ పేస్టు, దంతశోధనీ; టూత్ బ్రష్, కేశయమనకీలః ; పక్కపిన్ను, కైశ్యం : తలకట్టు,



వేణీ : జడ, అర్ధవేణీ : సగంజడ, వేణీపట్టః : రిబ్బను, ఉత్తరీయం : పైట, ఉత్తరీయయమనం : పైటపిన్ను, వాలపాశ్యా : రాగిడీబిళ్ళ, అంగికా : చొక్కా, వస్త్రోర్మిః : కుచ్చిళ్లు, వస్త్రం ; వస్త్రము, చండాతకం . తొడలవరకు ఉండే వస్త్రము, లేదా స్వెట్టరు పెటీకోట్, శాటీ ; దుప్పటి, శాటకః : తువ్వాలు, హసావళీ : పెద్దదుప్పటి, కంథా:బొంత, తాంబూలం ; తాంబూలము, వీటీ ; కిళ్ళీ, సుధా : సున్నము, క్రముకః: వక్కపొడి, తాంబూలకరంకః ; తమలపాకులపెట్టె, డోలా :ఊయల, హస్తప్రావారకః:రుమాలు, ఉష్ణీషః :తలపాగ, అనుప్రపదీనం:బూటు, నీలమణయః : నల్లపూసలు.

పాఠము - 20

# ఫలాని - పండ్లు

కదళీఫలం ; అరటిపండు, హరితకదళీఫలం ; పచ్చరటిపండు, అమృతకదళీఫలం ; చక్రకేళిపండు, దాడిమం ; దానిమ్మ, పనసం : పనస, ఆమ్రం : మామిడిపండు, రసాలం ; పీల్పుమామిడి, జంబూఫలం ; నేరేడు, బీజాపూరః : జామి, సీతాఫలం : సీతాఫలం, నారంగం:నారింజ, బత్తాయి, ద్రాక్షా : ద్రాక్ష, వాతామఫలం : బాదంపండు, భల్లాతకీఫలం : జీడిమామిడి, ఖర్జూరం : ఖర్జూరము, పిండఖర్జూరం ; ముంతఖర్జూరం, మ్లానద్రాక్షా :ఎండుద్రాక్ష, క్షుద్రద్రాక్షా:కిస్మిసలు, మాతులుంగం : మాదీఫలం, బదరీఫలం : రేగు, సించితికాఫలం ; యాపిల్, ఖేరీఫలం ; ఖేరీకాయ, (గంగరేగుకాయ)

పుష్పాణి : పువ్వులు, జపాపుష్పం ; గులాబి, సేవంతికా ; చేమంతి మాలతీకుసుమం ; మాలతి, వకుళం ; పొగడపువ్వు, పాటలం; పొగడ పువ్వు, నక్షత్రసేవంతికా;నక్షత్రచేమంతి, కురవకం ;గోరింట (ఎఱ్ఱ),

అంబష్ఠం ; అడవిమల్లె, శంఖపుష్పం : శంఖుపువ్వు. బంధూకం ; మంకెనపువ్వు లేదా ఎఱ్ఱమల్లె. అమ్లానం : గోరింట. కురంటకం ; పచ్చగోరింట. మరువకం ; మరువము. ప్రతాపసః ; తెల్లమందారం. శిరీషం ; దిరిసెనపువ్వు. ఉత్పలం ; కలువ. రక్తోత్పలం;ఎఱ్ఱకలువ. ఇందీవరం ; నల్లకలువ, అంభోజం ; తామర. సితాంభోజం ; తెల్ల తామర కుశేశయం ; నూరురేకులపువ్వు, సహస్రపత్రం ; వేయిరేకుల పువ్వు. సూర్యముఖీ ; ప్రొద్దుతిరుగుడుపువ్వు. కరవీరం ; గన్నేరు నళినం ; లిల్లీ. శేఫాలికా : పావిలి. పున్నాగం ; పొన్నపూవు. మందారం ; మందారం. పీతకరవీరం ; పచ్చగన్నేరు గుచ్ఛమందారం ; ముద్దమందారం. పారిజాతం : పారిజాతం. చంపకం:సంపెంగ. కుందం ; మల్లె పుష్పమంజరీ - పూలవెన్ను పుష్పగుచ్ఛం - పూలగుత్తి. తూలకంటకం - గొబ్బిపువ్వు. జాతీసుమం - సన్నజాజి. నవమాలికా కుసుమం - విరజాజి గుచ్ఛపుష్పం - బంతిపువ్వు. కేతకీ - మొగలి. కర్ణికారం - కొండగోగు. కోవిదారం - దేవకాంచనము, స్థలపద్మం ; మెట్టతామర. నాగమల్లీ - నాగమల్లి*

నాళికాః - తుపాకిగుండ్లు. నళయంత్రం - తుపాకి. శతఘ్ని - ఫిరంగి. బాణః - బాణము. ధనుః - విల్లు. సూర్మి - మండుచున్న ఇనుపకడ్డీ.

క్షారపత్రం - పొగాకు. ధూమనాళీ - సిగరెట్టు. నస్యం-ముక్కు పొడి ఉగ్రతాంబూలం - ఖారాకిళ్ళీ. మద్యం - కల్లు. మదిరా - సారాయి. అజయః - గంజాయి అహిఫేనం - నల్లమందు.

లోహాః - లోహములు. అయస్కాంతం - అయస్కాంతము.

ఖనిజః - Minerel, సీసం - సీసము. ఆరకూటః-ఇత్తడి. కాంస్యం-కంచు. రంగం - తగరము. పీతలోహః-సత్తు. సువర్ణం-బంగారము. రజతం - వెండి. తామ్రం - రాగి.



అయః - ఇనుము. లోహసారః - ఉక్కు

అభ్రకం - అభ్రకము. కాచః - గాజు.

చోరః - దొంగ, కుంభీలకః - కన్నపుదొంగ, దివాచోరః - పగటి దొంగ, లుంటాకః - దోపిడిదారుడు. సహోఢః - పట్టుబడినదొంగ, ఏకాగారికః - భవనాలుకొల్లగొట్టెదొంగ, దస్యుః - బందిపోటు, మహాచోరః - గజదొంగ.

నింబః - వేప పలాశః - మోదుగ, ప్లక్షః - జువ్వి. శమీ - జమ్మి. జంబూః - నేరేడు. రాజజంబూః - అల్లనేరేడు, బిల్వః - మారేడు. శాల్మలీ - బూరుగ. చించా - చింత, అశ్వత్థః - రావి, అర్జునః - మద్ది. పనసః-పనస. అర్కః - జిల్లేడు. భృంగరాజః-గుంటగలగర. దాడిమః - దానిమ్మ. శిగ్రుః - మునగ. కదంబః - కడిమి. ఆమలకః : ఉసిరిక, మరువకః : మరువము, విష్ణుక్రాన్తా ; విష్ణుక్రాంత, వృక్షః - చెట్టు, లతా - తీగ, స్కంధః - బోదె, శాఖా - కొమ్మ, కళికా - మొగ్గ, కేసరః - కేసరము, శిరహటః - అడుగున ఉండేదుంప ఆమ్రః - మామిడి, జంబీరః - నిమ్మ, బృహజ్జంబీరః - దబ్బ, మధూకః - ఇప్ప, నాగరంగః - నారింజ, నారికేళః : కొబ్బరి అరిష్టః - కుంకుడు, వాతామః - బాదం, మాచీ - మాచికాయచెట్టు, దూర్వా - గరిక, కుశః - దర్భ, తృణమ్ - గడ్డి, ఘాసః-పచ్చిగడ్డి, వేణుః - వెదురు, బదరీ - రేగు, అపామార్గః - ఉత్తరేణి, తులసీ - తులసి, కరవీరః - గన్నేరు, తాళః - తాటి, బర్బరః-తుమ్మ, కపిత్థః-వెలగ, గుల్మః - పొద, నికుంజః - పొదరిల్లు, కాండః - కాండము, శిఫా - ఊడ. కింజల్కః - కింజల్కము, వరాటకః-విత్తనాలకోశము. వృంతమ్ - తొడిమ. పుష్పకోశః - పుష్పకోశము. abyx, దళమ్ : రేకు, అంకురః : మొలక, బీజమ్ : విత్తనము, గర్భాంకురః :

Embryo, సంపాదితాహారః : stored food, కవచమ్ : పొరలేక పెంకు, బీజకవచమ్ : Nut shell, పుష్పమ్ : పువ్వు, తిలవృక్షః : నువ్వుచెట్టు, పురుషః : పురుషుడు, స్త్రీ : స్త్రీ, బాలః : బాలుడు, కళాకారః : కళాకారుడు, వంశవర్తీ : వెదురుగడపై ఆడేవ్యక్తి : చిత్రకారః:చిత్రకారుడు, కవిః : కవి, రచయితా:రచయిత,విమర్శకః : విమర్శకుడు, తక్షకః : వడ్రంగి, కుంభకారః:కుమ్మరి, తంతువాయః : నేతగాడు, స్వర్ణకారః : కంసాలి, ఉపాధ్యాయః : ఉపాధ్యాయుడు, ప్రాడ్వివాకః : లాయరు, శిల్పి : శిల్పి, నటః : నటుడు, గాయకః : గాయకుడు, మార్దంగికః : మద్దెలవాయించువాడు, వైణవికః : పిల్లనగ్రోవిఊదువాడు, పాదుకాకారః : చెప్పులుకుట్టువాడు, కృషీవలః : రైతు, మాలాకారః : పువ్వులుగ్రుచ్చువాడు, సైరంధ్రీ : పువ్వులుగుచ్చుస్త్రీ, ఉద్యానపాలః : తోటమాలి, భృత్యః : సేవకుడు, లేపకః: రంగులుపూయువాడు, సౌచికః : దర్జీవాడు, నూరజికః ; డప్పువాయించువాడు, పాణిఘః : చేతులతో తాళమువేయువాడు, వైణికః :వీణవాయించువాడు, శాకునికః : శకునం చెప్పేవాడు, వాగురికః : జాలరి, వాగ్మి : వక్త, మాంసికః ; మాంసము అమ్మువాడు, వార్తాహరః : పోస్టుమాన్, భారికః . బరువులు మోయువాడు, శాకటికః ; బండివాడు, నాపితః : మంగలివాడు, రజకః : చాకలి, జాబాలః : మేకలు మేపువాడు, దేవలః : దేవునిబొమ్మలమ్మువాడు, గోపః : గొల్లవాడు, ప్రేక్షకః : ప్రేక్షకుడు, అవచాయకః : కోయువాడు, దూతః : దూత, వృత్తికారః:వృత్తికారుడు, విదూషకః ; హాస్యగాడు, పురోహితః ; పురోహితుడు, రాజా : రాజు, రాజ్ఞీ ; రాణి, సేనాధిపతిః :సేనాధిపతి, అశ్వికః:రౌతు, వైద్యః:డాక్టరు, యాంత్రికః : యంత్రమునడుపువాడు, మాంత్రికః ; మాంత్రికుడు, జ్యౌతిషికః : జ్యోతిష్కుడు, ద్విచక్రయానమ్:సైకిలు, ప్రవాహణమ్:



రిక్షా, శకటమ్, బండి, గోశకటమ్:ఎడ్లబండి, తైలశకటమ్ : బస్సు, ధూమశకటమ్ : రైలు, విద్యుచ్ఛకటమ్ : ఎలక్ట్రిక్ రైలు, నౌః ; నావ, తరణిః : ఓడ, విమానమ్ : విమానము.

భారమితిః ; Barometre సూక్ష్మదర్శినీ, Micro scope దిక్సూచీ : Mariner's compass ఛాయాగ్రాహకమ్ : Camera దూరదర్శినీ : Tele scope ధ్వనిస్థాపనీ : Gram phone, ఆకాశవాణీ : Radio విద్యుద్వేగజననీ : Dynamo విద్యుచ్ఛక్తిమాపకమ్ : Volta metre విద్యుచ్ఛక్తిమాపనీ:Galvometre, తారావార్తాయన్త్రమ్, Tele graph యక్షిణీదీపః : Magic lanter, చలనశకటం : motor car ఘనత్వమాపకం , Hydrometre, ఉత్పీడనయన్త్రం : Brahma press, విద్యుత్పాత్రం ; Battery, శబ్దవాహకతారాయన్త్రం ; Telephone, సూక్ష్మశ్రవణయంత్రం; micro phone,బహురూపదర్శకం; Kaladio scope, సూక్ష్మవస్తుమాపకః ; micro metre, ఆర్ద్రతామాపకం ; Hygrometre.

పాఠము-21

# వాల్మీకి సూక్తులు

## వాల్మీకి ప్రశంస

1) కూజన్తం రామరామేతి మధురం మధురాక్షరమ్
ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకి కోకిలమ్.

కవిత్వం అనే కొమ్మనెక్కి అందమైన అక్షరాలతో కూడిన 'రామ, రామ' అనే పదాలను వినసొంపుగా గానంచేస్తున్న వాల్మీకి కోకిలను నమస్కరిస్తున్నాను.

— సూక్తులు —

2) న్యాయేన రాజ్యకార్యాణి యః కరోతి దశానన
న స సంతప్యతే పశ్చాన్నిశ్చితార్థమతిర్నృపః. యు. 12స. 30శ్లో

రావణా ! న్యాయంగా రాజకార్యాలు చేస్తూ పాలించేరాజు నిశ్చయమైన విషయాలు గలవాడై తరువాత కాలంలో కూడా ఎప్పుడూ బాధపడడు.

3) యథా శరది మేఘానాం సించతామపి గర్జతామ్
న భవత్యంబు సంక్లేదః తథాఽనార్యేషు సౌహృదమ్.

యు: 16 స. 12 శ్లో.

శరత్కాలంలోని మబ్బులు గర్జనచేస్తున్నా, చినుకులను కురిపిస్తున్నా మంచివాన ఎలా ఉండదో అలాగే అధముల స్నేహం కూడ ఉంటుంది. హామీలు ఇవ్వడం, చిన్న చిన్న సహాయాలు చేయడం చేస్తున్నట్లు ఉన్నా సరియైన సహాయాన్ని అంటే ఉపాధిని కలిగించడం లాంటివి మాత్రం చేయరు.

4) పరస్వహరణే యుక్తం పరదారాభిమర్శకమ్
త్యాజ్యమాహుర్దురాత్మానం వేశ్మ ప్రజ్వలితం యథా.

యు. 87 స. 22 శ్లో.

ఇతరుల ధనాన్ని, స్త్రీలను అపహరించే వానిని నిప్పంటుకున్న యింటిని విడచినట్లే విడచివేయాలని పెద్దలు చెబుతున్నారు.

5) మరణాన్తాని వైరాణి నివృత్తం నః ప్రయోజనమ్
క్రియతామస్య సంస్కారో మమాప్యేష యథా తవ.

యు. 109 స. 25 శ్లో.



రావణసంహారం జరిగాక రాముడు విభీషణునితో అంటున్న మాట. శత్రుత్వం మరణం వరకు మాత్రమే ఉంటుంది. రావణుని జయించాలనే మన సంకల్పం నెరవేరింది. కనుక ఇప్పుడు ఇతనికి దహన సంస్కారం చెయ్యి నీకు యితడు ఎలాంటివాడో నాకూ అలాంటివాడే.

6) సభారస్సౌమ్య భర్తవ్యో యో నరం నావసాదయేత్
తదన్నమపి భోక్తవ్యం జీర్యతే యదనామయమ్

అర. 50 స. 18 శ్లో.

ఓ మంచివాడా ! ఎంత బాధ్యతవహిస్తే తనకు నష్టంరాదో అంతే భారాన్ని వహించాలి. అంతకంటె ఎక్కువకూడదు. అలాగే అనారోగ్యం కలుగకుండా ఎంత తింటే జీర్ణమవుతుందో అంతే అన్నంతినాలి.

# సంస్కృత సంధి వివేకము

## పాఠము - 22

పాఠకులారా !

రెండు పదములు కలసినప్పుడు వాని మధ్య కొన్ని మార్పులేర్పడును. సంస్కృతము, తెలుగు మొ॥ భాషలయందు యిట్టి మార్పులు ఎక్కువగా గోచరించును. కొన్ని భాషలలో రెండు పదములను కలిపినపుడు ఎట్టి మార్పులేక ఆ పదములు అట్లే యుండును. ఆ భాషల స్వరూపం కొంచెం భిన్నంగా ఉంటుంది. ఉదా : ఇంగ్లీషుభాష Rama is a boy ఏ వాక్యమునందలి పదముల మధ్యను సంధిగోచరింపదు. రెండు పదములను కలిపినప్పుడు సంస్కృతమునందు వాని మధ్య మార్పు ఏర్పడును. అట్టి మార్పులనే సంధులు అందురు.

పదముల మధ్యగల మార్పులను బట్టి సంధులు అనేక రకములుగా నుండును. భాషను మాట్లాడేటప్పుడు లేదా వ్రాసేటప్పుడు పదముల మధ్య సంధిచేసికొని, సంధిచేయక విడిపదములనుగాని వాడవచ్చును. సంధిచేసే వాడాలనే నియమం ఏమీలేదు. కాని సంస్కృత పుస్తకాలలో గాని, ఇతరులు మాట్లాడేటప్పుడుగాని సంధిచేయబడి ఉన్నా మనం తెలుసుకోగలగాలి. అవసరం అనుకుంటే మనంగూడ వాడగలగాలి. అందుకే మనం సంధులను గూర్చి తెలుసుకుందాం.

సంస్కృత సంధులు అనేకరకాలు. సంధులు ముఖ్యంగా 1) అచ్ సంధి 2) ప్రకృతి భావము 3) హల్ సంధి 4) విసర్గసంధి 5) స్వాదిసంధి అని ఐదువిధాలు. ఏ సంధి జరుగక పదాలు సంధికిముందు ఎలాగో తరువాతకూడ అలాగే ఉంటే దానిని ప్రకృతి భావసంధి అంటారు. నిజానికి యిది సంధికాదు. కాని సంధి క్రింద వ్యవహరింప బడుతూ ఉంటుంది.

అచ్ సంధి : అ, ఇ, ఉ, ఋ, ఌ, ఎ, ఐ, ఓ, ఔ, అం, అః అనేవి అచ్చులు. వీటి దీర్ఘాలుగూడ అచ్చుల క్రిందే లెక్క. ఈ అచ్చులలో దేనికైనా మరియొక అచ్చుపరంగా ఉంటె వచ్చే మార్పునే అచ్ సంధి అంటారు. ఈ అచ్ సంధిలో అనేక రకాలున్నాయి. ముఖ్యంగా.

1) యణాదేశసంధి 2) ఎచోఽయవాయావసంధి 3) గుణసంధి 4) వృద్ధిసంధి 5) పరరూపసంధి 6) సవర్ణదీర్ఘసంధి 7) పూర్వరూప సంధి 8) ప్రకృతి భావసంధిలో భేదాలేమీలేవు. హల్ సంధిలో 1) శ్చుత్వసంధి 2) ష్టుత్వసంధి 3) జశ్త్వసంధి 4) అనునాసికసంధి 5) పరసవర్ణసంధి 6) పూర్వసవర్ణసంధి 7) ఛత్వసంధి 8) చర్త్వసంధి 9) అనుస్వారసంధి.



ఇవిగాక ఇంకా హల్ సంధిలో ఆగమ సంధులున్నాయి. అవి వేరే ప్రకరణంలో తెలియజేస్తాను. లోకంలో ప్రచారంలో ఉన్నవి. 1) జముడాగమసంధి 2) తుగాగమసంధి.

విసర్గసంధిలో భేదాలులేవు. విసర్గకు వచ్చే మార్పులు వివరింప బడతాయి. విభక్తులకు వచ్చేమార్పులు స్వాదిసంధిలో ఉంటాయి.

పాఠము - 23

# అచ్ సంధుల వివరణము

1) యణాదేశసంధి : య, వ, ర, ల అను అక్షరములకు యణ్ అనిపేరు.

ఇ, ఉ, ఋ, ఌ అను అక్షరములకు అచ్చుపరముగా నున్నపుడు వరుసగా య, వ, ర, ల అనే అక్షరాలు వస్తాయి. దీనినే యణాదేశ సంధి అంటారు.

ఉదా : సుధీ + ఉపాస్య అని పదాలున్నప్పుడు పై నియమం వలన ఇకారానికి (ఈ కారంగూడ ఇకారమే అని గుర్తించాలి. దీర్ఘాక్షరాలకైనా ఇదే నియమం వర్తిస్తుంది.) యకారం వస్తుంది. య, వ, ర, ల అన్నప్పుడు న్యాయంగా య్, వ్, ర్, ల్ అనేవే వస్తాయని గ్రహించాలి. పలకడానికి వీలుగా అకారంచేర్చి య, వ, ర, ల అని మాట వరసకి వాడుకలో అంటున్నాము. కనుక,

సుధ్ + ఈ + ఉపాస్య అన్నప్పుడు యకారం వచ్చి సుధ్యుపాస్యః అని అవుతుంది.

ఉకారానికి : మధు + అరి; మధ్ + ఉ + అరి; మధ్వ్ X అరి = మధ్వరిః

ఋకారానికి : ధాతృ X అంశ; ధాత్ X ఋ X అంశ; ధాత్ X ర్ X అంశ = ధాత్రంశః

ఌకారానికి : ఌ X ఆకృతి; ల్ X ఆకృతి = లాకృతిః. ఇలాగే యది X అపి = యద్యపి. స్వాదు X అన్నమ్ = స్వాద్వన్నమ్, ఇతి X అత్ర = ఇత్యత్ర, వధూ X అర్థ - వధ్వర్థమ్.

అభ్యాసము :

1) ఈ క్రింది పదాలను కలిపి ఈ సంధిని చక్కగా గుర్తింపుడు.

1) హరి X అనుభవః 2) స్వాదు X అన్నమ్ 3) ఇతి X అపః 4) ఇందు X అగ్నిః.

II) విడదీయుము

1) పిత్రాజ్ఞా 2) కవ్యుక్తిః 3) విష్ణ్వంశః 4) ప్రభ్వాదేశః

2) ఏచోఽయవాయావసంధి

ఏ, ఓ, ఐ, ఔ అను అక్షరములకు అచ్చుపరంగా ఉంటే క్రమంగా అయ్, అవ్, ఆయ్, ఆవ్ అనేవి ఏ, ఓ, ఐ, ఔ లకు రావడమే ఈ సంధి.

ఉదా :- హరే X ఏ = హరయ్ X ఏ = హరయే
విష్ణో X ఏ = విష్ణవ్ X ఏ = విష్ణవే
నై X అక = నాయ్ X అక = నాయకః
పౌ X అక = పావ్ X అక = పావకః



3) గుణసంధి

అకారానికి అచ్చుపరంగానున్నపుడు గుణము ఆదేశంగా రావడమే గుణసంధి. అ, ఎ, ఓ అనే మూడు అక్షరాలకు గుణమని పేరు. ఈ అక్షరాలు మొదటిపదం చివరి అచ్చుకు, రెండవపదము మొదటి అచ్చుకు కలిపి వస్తాయి.

అనగా ఆ రెండింటి స్థానంలో వస్తాయి.

ఉదా : ఉప X ఇంద్ర = ఉపేంద్రః; రామ X ఈరితాః రామేరితాః
రమా X ఈశ = రమేశః, కుంభకర్ణ X ఇంద్రజిత్ - కుంభకర్ణేంద్రజితౌ.
గంగా X ఉదకమ్ = గంగోదకమ్, ఫల X ఉద్గమ = ఫలోద్గమః

పై గుణాక్షరాలలో అకారం అర్‌గా మారి వస్తుందని గ్రహించాలి.

ఉదా ; కృష్ణ X ఋద్ధి = కృష్ణర్ద్ధిః

4) వృద్ధిసంధి ;

ఆ, ఐ, ఔ అనే మూడక్షరాలకు వృద్ధి అని పేరు. ఈ అక్షరాలు రావడమే వృద్ధిరావడము. అకారానికి ఏ, ఓ, ఐ, ఔలు పరంగా ఉంటే ఆ, ఐ, ఔలు వస్తాయి.

ఉదా : కృష్ణ + ఏకత్వ = కృష్ణైకత్వమ్, చ X ఏవ = చైవ,
సా X ఏషా - సైషా
గంగా X ఓఘ - గంగౌఘః, తండుల X ఓదనమ్ - తండులౌదనమ్.
దేవ X ఐశ్వర్య - దేవైశ్వర్యమ్, తథా X ఏవ - తథైవ
కృష్ణ X ఔత్కణ్ఠ్య - కృష్ణౌత్కణ్ఠ్యమ్, నవ - ఔషధమ్ -
నవౌషధమ్.

## పాఠము-24

### 5) పరరూపసంధి

అకారానికి ఏ, ఓలు పరంగా ఉంటే పరంగాఉన్న ఏ, ఓలే ఆదేశంగా రావడమే పరరూపసంధి.

ఉదా : ప్ర x ఏజతే – ప్రేజతే

ఉప x ఓషతి – ఉపోషతి

### 6) సవర్ణదీర్ఘసంధి

అ, ఇ, ఉ, ఋ అను అక్షరములకు క్రమముగా అవే అక్షరములు అనగా అ, ఇ, ఉ, ఋ అను అక్షరములు పరముగానున్నపుడు దీర్ఘము ఏకాదేశంగా రావడమే సవర్ణదీర్ఘసంధి. దీర్ఘానికి దీర్ఘము పరంగానున్నా దీర్ఘము వస్తుంది. ఈ క్రింది మార్పులు గమనించండి.

అ x అ – ఆ; ఆ x అ – ఆ; అ x ఆ – ఆ; ఆ x ఆ – ఆ.

ఇలాగే మిగిలిన అక్షరాలకుగూడ గమనించండి.

ఉదా :

దైత్య x అరి – దైత్యారిః, వ్రత x అన్తే – వ్రతాన్తే,

సిద్ధ x అర్థ – సిద్ధార్థః

శ్రీ x ఈశ – శ్రీశః, మయి x ఇవ – మయీవ, గిరి x ఈశ – గిరీశః

విష్ణు x ఉదయ – విష్ణూదయః, భాను x ఉదయ – భానూదయః

పితృ x ఋణ – పితౄణమ్.

### 7) పూర్వరూపసంధి

పదము చివరలోగల ఏ, ఓ అను అక్షరాలకు 'అ' అనే అక్షరము పరంగా ఉన్నపుడు పూర్వరూపమైన (మొదటిపదం చివరగల) అక్షరమే ఆదేశంగా వస్తుంది.



హరే x అవ – హరేవ (ఇక్కడ అకారం సంధికిముందుండేది అని తెలియజేయడానికి గుర్తుగా వకారానికిముందు ఈ గుర్తు వ్రాయాలి ఽ) హరేఽవ.

విష్ణో x అవ – విష్ణోఽవ, వనే x అర్చయత్, వనేఽర్చయత్

### 8) ప్రకృతిభావసంధి :

ఈ సంధిలో సంధిచేయడానికి ముందు పదాలెలా ఉన్నాయో సంధి చేసాకగూడ ఏ మార్పులేకుండా అలానే ఉంటాయి.

ఉదా : ఏహికృష్ణ x అత్రగౌశ్చరతి – ఏహికృష్ణ అత్రగౌశ్చరతి.

కృష్ణ x అత్ర – కృష్ణాత్రగాదని గ్రహించండి.

హరీ x ఏతౌ – హరీఏతౌ.

# హల్సంధులు

## పాఠము – 25

### 1) శ్చుత్వసంధి :

స, త, థ, ద, ధ, న అనే అక్షరాలకు శ, చ, ఛ, జ, ఝ, ఞ అనే అక్షరాలతో సంబంధం ఏర్పడితే శ, చ, ఛ, జ, ఝ, ఞ అనే అక్షరాలే రావటం శ్చుత్వసంధి అని గ్రహించాలి.

ఉదా : హరిస్ x శేతే – హరిశ్శేతే. సకారానికి శకారం వచ్చింది.

ధర్మైస్ x చ – ధర్మైశ్చ, రామస్ x చ – రామశ్చ

రామస్ x చినోతి – రామశ్చినోతి. ఇలాగే మిగిలినచోట్ల గుర్తించండి.)

సత్ x చిత్ - సచ్చిత్; సత్ x జన - సజ్జనః

శార్ఙ్గిన్ x జయ - శార్ఙ్గిజ్జయ.

౨) ష్టుత్వసంధి :

స, త, థ, ద, ధ, న అనే అక్షరాలకు ష, ట, ఠ, డ, ఢ, ణ అనే అక్షరాలతో సంబంధం ఏర్పడితే ష, ట, ఠ, డ, ఢ, ణ అనే అక్షరాలే రావడం ష్టుత్వ సంధి.

ఉదా : రామస్ x షష్ఠ - రామష్షష్ఠః (స, కి, ష, వచ్చింది)

రామస్ x టీకతే - రామష్టీకతే.

పేస్ x టా - పేష్టా.

తత్ x టీకా - తట్టీకా.

చక్రిన్ x ఢౌకసే - చక్రిణ్ఢౌకసే.

౩) జశ్త్వసంధి :

పదము చివరలో ఉండే ఝ, భ, ఘ, ఢ, ధ అక్షరాలకు జ, బ, గ, డ, ద అనే అక్షరాలు వస్తాయి. ఇదే జశ్త్వసంధి.

ఉదా : పటత్ x ఇతి - పటదితి. (తకారం దకారం అయింది.)

వాక్ x ఈశ - వాగీశః (కకారం గకారం అయింది.)

చిత్ x రూప - చిద్రూపమ్:

ఇలాగే ఝ, భ, ఘ, డ, ధ అనే అక్షరాలకు ఇవే అక్షరాలు పరంగా ఉన్నా మొదటి అక్షరాలకు జ, బ, గ, డ, ద అనేవి వస్తాయి. ఇదికూడా జశ్త్వసంధే



ఉదా : సుధ్ X ధ్ - సుద్ధ్

వృధ్ X ధి - వృద్ధిః

౪) అనునాసికసంధి ;

పదం చివర 'హ' అనే అక్షరం తప్ప ఏ అక్షరం ఉన్నా దానికి అను నాసికాక్షరం పరంగా ఉంటే ఆ మొదటి పదం చివరి అక్షరానికిగూడ అను నాసికాక్షరమే రావడం అను నాసికసంధి.

ఙ, ఞ, ణ, న, మ - ఇవి అను నాసికాక్షరములు.

ఏతత్ x మురారి - ఏతన్మురారిః (ఇక్కడతకి న వచ్చింది. ఇలా రాకుండాకూడ ఉండవచ్చును. ఉదా : ఏతద్మురారిః.)

చిత్ x మయ - చిన్మయమ్

౫) పరసవర్ణసంధి

త, థ, ద, ధ, న అనే అక్షరాలకు 'ల' అనే అక్షరం పరంగా ఉంటే మొదటి పదం చివరి అక్షరానికిగూడ లకారమే రావడం పరసవర్ణసంధి.

ఉదా : తత్ x లయః - తల్లయః.

పాఠము - 26

౬) పూర్వసవర్ణసంధి :

ఝ, భ, ఘ, ఢ, ధ, జ, బ, గ, డ, ద, ఖ, ఫ, ఛ, ఠ, థ, చ, ట, త, క, ప అనే అక్షరాలకు 'హ' అనే అక్షరం పరంగా ఉంటే పూర్వసవర్ణం (మొదటి అక్షరంతో సమానమైనది) 'హ' అనే దానికి వస్తుంది.

వాక్ x హరిః - వాఘ్గరిః ('క'తో సమానమైనది ఘ, అది, హకి, వచ్చింది.)

పాఠకులారా ! కొంచెం కష్టంగా ఉందంటూరా ! నిజమే. 'వాక్ x హరి=వాఘ్గరిః' అవుతుందని మాత్రం గుర్తుంచుకోండి. ప్రస్తుతానికిచాలు. శాస్త్రం గొప్పది. నిదానంగా వస్తుందిలెండి. ఇక ముందుకు సాగండి.

8) అనుస్వారసంధి

మకారం చివఉగల పదంలోని మకారానికి హల్లు పరంగా ఉంటే అనుస్వార వస్తుంది. ఇదే అనుస్వారసంధి. అనుస్వారం అంటే అక్షరంపైన ఉండే చుక్క బిందువు.

హరిమ్ x వందే = హరిం వందే.

పదం మధ్యగల మ, న అక్షరాలకు పై సంఘలలోని 'ఝ మొదలు స' వఱకు గలవిగాని 'హ' గాని పరంగా ఉంటే అనుస్వారం వస్తుంది.

యశాన్ + సి = యశాంసి.

## ఆగమసంధులు

పాఠము - 27

1) జముడాగమసంధి :

జ, ణ, న అనే వాటికి అచ్చుపరంగా ఉంటే రెండవ జ,ణ,నలు వస్తాయి. అంటే జ క్రింద జ, ణ క్రింద ణ, న క్రింద న వస్తాయని అర్థము.



ఉదా : ప్రత్యఙ్ + ఆత్మ = ప్రత్యఙ్ఙాత్మా

సుగణ్ + ఈశ = సుగణ్ణీశః

సన్ + అచ్యుత = సన్నచ్యుతః.

2) తుగాగమసంధి :

హ్రస్వానికి 'ఛ' అనే అక్షరం పరంగా ఉంటే మధ్యలో 'త్' అనేది రావడమే తుగాగమసంధి.

ఉదా : శివ + ఛాయా = శివత్ + ఛాయా = శివచ్ఛాయా.

('త' 'చ' అయిందనుకొండి. అదివేరే విషయం.)

దీర్ఘం తరువాత 'ఛ' పరంగాఉన్నా మధ్యలో 'త్' వస్తుంది. అది 'చ్' అవుతుంది.

ఉదా : లక్ష్మీ + ఛాయా = లక్ష్మీచ్ఛాయా.

## విసర్గసంధులు

పాఠము - 28

విసర్గకు (ః) వచ్చే మార్పులగూర్చి యీ పాఠంలో తెలుసుకుందాం.

1) విసర్గకు సాధారణంగా సకారం వస్తుంది.

ఉదా ; విష్ణుః x త్రాతా = విష్ణుస్ x త్రాతా = విష్ణుస్త్రాతా.

రామః x తత్ర=రామస్తత్ర; యశః x కల్ప=యశస్కల్పమ్

2) కొన్నిచోట్ల విసర్గకు విసర్గే వస్తుంది. అంటే అలాగే ఉంటుంది.

ఉదా ; కః x త్సరుః = కఃత్సరుః

3) కొన్ని సందర్భాలలో విసర్గకు షకారం వస్తుంది.

ఉదా : సర్పిః x కామ్యతి = సర్పిష్కామ్యతి.

ఆవిః x కృతమ్ = ఆవిష్కృతమ్.

దుః x కృతమ్ = దుష్కృతమ్.

4) కొన్నిచోట్ల విసర్గకు రేఫ వస్తుంది.

ఉ : ప్రాతః x అత్ర = ప్రాతరత్ర; అహః X గణః_అహర్గణః

5) కొన్నిచోట్ల విసర్గకు ఉకారం వస్తుంది.

ఉదా : శివః x వంద్యః = శివ x ఉ x వంద్య = శివో వంద్యః.

ఇక్కడ ఉదాహరణలో అ x ఉ-ఓ అయ్యింది. ఇది గుణసంధి. దీన్ని గూర్చి ముందే తెలుసుకున్నాంగదా.

6) మరికొన్ని స్థలాలలో విసర్గ లోపిస్తుంది.

ఉదా: దేవాః X అత్ర–దేవా అత్ర; భోః x అచ్యుత_భో అచ్యుత.

భోః x లక్ష్మి - భోలక్ష్మి; దేవాః X యాన్తి - దేవాయాన్తి.

ఏషః x విష్ణుః - ఏష విష్ణుః.

7) కొన్నిచోట్ల విసర్గలోపించి విసర్గకు ముందున్న అచ్చుకు దీర్ఘం వస్తుంది. దీన్ని 'ఢలోపసంధి' అనవచ్చును.

ఉదా : పునః Xరమతే - పున Xరమతే - పునా రమతే

హరిః Xరమ్యః - హరి x రమ్యః - హరీరమ్యః

శంభుః x రాజతే - శంభు x రాజతే - శంభూరాజతే.

ఇవన్నీ విసర్గకు వచ్చేమార్పులు. దీంట్లోనే విభక్తుల మార్పులు గూడ చేరాయి. ఇవే స్వాదిసంధులుగూడ అవుతాయి.



# కొన్ని సుళువులు

సంస్కృతం నేర్చుకుంటున్న పాఠకులారా !

ఈ సంధులన్నీ జాగ్రత్తగా చదవండి. కొంచెం కొంచెం అర్థంచేసుకోండి. నిదానంగా ఆలోచించండి. ఏ భాషా కష్టంకాదు. కొంచెంశ్రమ ఏ భాషలోనైనా, ఏ విషయంలోనైనా తప్పదు. అసలు ఆమాటకివస్తే ఏభాష తేలికో చెప్పండి. ఏ విషయంలో కష్టం దానికుంటుంది. ఎంతో శ్రమపడి సైన్సులు, ఎకనమిక్స్, జర్నలిజం, లెక్కలు, సాంకేతిక విద్యలు, వైద్యం నేర్చుకుంటున్నారు గదా. వాటిని శ్రమ అని ఊరుకుంటున్నారా? చెప్పండి. సంస్కృతమే కష్టం అనుకోవడం భావ్యంకాదు. కొంచెం శ్రమ అయినా సంస్కృతం నేర్చుకోండి. ఇహానికి, పరానికి ఉపయోగపడుతుంది. విఘ్నాలు రాకుండా ఎలా ఉంటాయి? అయినా ధైర్యంగా లక్ష్యాన్ని సాధించాలి. నేనూ సంస్కృతం నేర్చుకున్నాను అని అనండి.

సుళువు : పై సంధులువస్తే మంచిది. రాకపోయినా నిరుత్సాహపడకండి. సంధులు చేయకుండా కూడ పదాలన్నీ వాడుకోవచ్చు. సంధిచేయకుండా మాట్లాడవచ్చు. విడివిడిగానే వ్రాయవచ్చు.

---

మీ భయం తీరిందికదా ! ఇక కొన్ని సూక్తులు నేర్చుకోండి..

# శ్రీ వేదవ్యాస మహర్షి సూక్తులు

పాఠము _ 29

పాఠకులారా ! మొదట వాల్మీకిమహర్షి సూక్తులను తెలుసుకున్నారుగదా. అలాగే ఇప్పుడు వ్యాసముని సూక్తులను కొన్నింటిని నేర్చుకోండి. వాల్మీకి వ్యాసులు భగవత్సాక్షాత్కారం పొందినవారు

సంస్కృతానికి మూలపురుషులు. మహాకవులు. వ్యాసుడు, మహాభారతాన్ని, అష్టాదశ (18) పురాణాలను, శ్రీమద్భాగవతాన్ని రచించాడు. భారత భాగవతాలలోని సూక్తులను తెలుసుకుందాం.

1) శోకస్థానసహస్రాణి హర్షస్థానశతాని చ
దివసే దివసే మూఢమావిశన్తి న పండితమ్.

దుఃఖానికున్న అనేక కారణాలుగాని, సంతోషానికిగల అనేక కారణములుగాని ప్రతిరోజు మూర్ఖుడిని బాధిస్తాయే తప్ప పండితుని బాధించవు. అంటే సామాన్యుడు ప్రతిదినము, ప్రతిక్షణము దుఃఖిస్తూ ఉంటాడు. అలాగే సంతోషిస్తాడు. క్షణానికి క్రుంగిపోతాడు. మరు క్షణంలో ఉబ్బిపోతాడు. కాని విజ్ఞుడు స్థిరమైన మనస్సుతో రెంటినీ సమానంగా గ్రహిస్తాడు.

2) అదత్తస్యానుపాదానమ్ దానమధ్యయనం తపః
అహింసా సత్యమక్రోధః ఇజ్యా ధర్మస్యలక్షణమ్.

ఇవ్వనిది తీసుకోకపోవడం, ఇతరులకు దానం చెయ్యడం అధ్యయనము, తపస్సుచేయడం. అహింస, సత్యము, కోపము లేకపోవుట, యజ్ఞములు మొ॥ మంచిపనులు చేయడం ధర్మానికి లక్షణాలు.

3) సా భార్యాయా ప్రియం బ్రూతే సపుత్రోయత్ర నిర్వృతిః
తన్మిత్రం యత్ర విశ్వాసః సదేశో యత్రజీవ్యతే.

ఏస్త్రీ ప్రియంగా మాట్లాడుతుందో ఆమెయేకదా భార్య. ఏవ్యక్తివద్ద మనస్సుకు తృప్తిలభిస్తుందో అతడే కదా పుత్రుడు. ఏ వ్యక్తిని మనం నిస్సంకోచంగా నమ్మగలమో అతడే మన మిత్రుడు. ఎక్కడ జీవనోపాధి లభిస్తుందో ఆదేశమే మన దేశమవుతుంది.

4) క్రోధః శత్రుః శరీరస్థో మనుష్యాణాం "ద్విజోత్తమ."
ఓ ఉత్తమ బ్రాహ్మణుడా! క్రోధమే మన శరీరంలోని శత్రువు.



# భాగవతంలో సూక్తులు

5) తితిక్షయా కరుణయా మైత్ర్యాచాఖిల జంతుషు
సమత్వేన చ సర్వాత్మా భగవాన్ సంప్రసీదతి.

అన్ని జీవులయందు ఓర్పు, కరుణచూపడం వలన, అన్ని ప్రాణులయందు మైత్రిని, సమదృష్టిని కలిగియుండడం వలన సర్వాంతర్యామి అయిన భగవంతుడు ప్రసన్నుడై యనుగ్రహించును.

6) గుణాధికాన్ముదం లిప్సేత్ అనుక్రోశం గుణాధమాత్
మైత్రీం సమానాదన్విచ్ఛేత్ న తాపైరభిభూయతే.

లోకంలో, మనకు మనస్సు బాధపడకుండా ఉండటానికి వ్యాసముని ఒక మంచి మార్గాన్ని సూచిస్తున్నాడు. గుణవంతుడిని చూచి సంతోషించడం, గుణహీనుడిని చూచి జాలిపడటం, సమానుడితో స్నేహం చెయ్యడం వలన మనస్సు ఏ విధంగాను బాధపడదు.

7) తతోదుస్సంగముత్సృజ్య సత్సుసజ్జేత బుద్ధిమాన్.

బుద్ధిమంతుడైనవాడు దుర్జనసాంగత్యాన్ని విడచి సజ్జనులతో స్నేహం చెయ్యాలి.

8) అన్నం హి ప్రాణినాం ప్రాణః ఆర్తానాం శరణం త్వహమ్
ధర్మోవిత్తం నృణాంప్రేత్య సంతోఽస్మాద్బిభ్యతోరణమ్.

# స్త్రీరూపములు

## పాఠము - 30

స్త్రీలింగంలోని పదాలు సాధారణంగా ఆ, ఈ, ఊ అన్తాలుగా ఉంటాయి.

ఉదా : రమా, లతా, గౌరీ, నదీ, చమూః, వధూః.

కొన్ని పదాలకు చివర 'తి' చేరుతుంది.

ఉదా ; గతిః, మతిః, నతిః.

కొన్ని ఉకారాంత శబ్దాలుంటాయి. ఉదా ; ధేనుః, తనుః.

ఇవి ప్రధానమైన మార్పులు. కొన్ని పదాలు పులింగంలోను, స్త్రీలింగంలోను ఉంటాయి. అవి పులింగంలోని పదాలు స్త్రీ లింగాలయితే ఎలా ఉంటాయో ఈ పాఠంలో తెలుసుకొండి.

| పుంలింగము | స్త్రీ లింగము |
|---|---|
| అజః (మేక) | అజా (ఆడు మేక) |
| అశ్వః (గుఱ్ఱము) | అశ్వా |
| చటకః (పిచ్చుక) | చటకా |
| మూషికః (ఎలుక) | మూషికా |
| బాలః (బాలుడు) | బాలా |
| వత్సః (బిడ్డ) | వత్సా |
| శూద్రః (శూద్రుడు) | శూద్రా |
| సత్పుష్పః (మంచి పువ్వులుగల చెట్టు) | సత్పుష్పా |
| జ్యేష్ఠః (పెద్దవాడు) | జ్యేష్ఠా |
| కనిష్ఠః (చిన్నవాడు) | కనిష్ఠా |
| మధ్యమః (మధ్యగలవాడు) | మధ్యమా |
| కోకిలః (కోకిల) | కోకిలా |
| కర్తా (చేయువాడు) | కర్త్రీ |



| | |
|---|---|
| దండీ (కఱ్ఱనుధరించువాడు) | దండినీ |
| పచన్ (వండుచున్నవాడు) | పచన్తీ |
| ఏకః (ఒకడు) | ఏకా |
| ద్వౌ (ఇద్దఱు) | ద్వే |
| త్రయః (ముగ్గురు) | తిస్రః |
| చత్వారః (నలుగురు) | చతస్రః |
| సర్వకః (ప్రతివాడు) | సర్వికా |
| కారకః (చేయువాడు) | కారికా |
| మామకః (నావాడు) | మామికా |
| దేవః (దేవుడు) | దేవీ |
| ఆర్యః (పూజ్యుడు) | ఆర్యా |
| యాదృశః (ఎటువంటివాడయితే) | యాదృశీ |
| చౌరః (దొంగ) | చౌరీ |
| తటః (ఒడ్డు) | తటీ |
| తరుణః (యవ్వనముగలవాడు) | తరుణీ |
| కుమారః (కుమారుడు) | కుమారీ |
| పతిః (భర్త) | పత్నీ |
| ఏతః (రంగు) | ఏనీ, ఏతా |
| రోహితః (రంగు) | రోహిణీ, రోహితా |
| పిశఙ్గః (రంగు) | పిశఙ్గీ, పిశఙ్గా |

| | |
|---|---|
| పారఙ్గః (లేడి) | పారఙ్గీ |
| కృష్ణః (నల్లనివాడు) | కృష్ణా |
| కపిలః (రంగు) | కపిలా |
| నర్తకః (నాట్యముచేయువాడు) | నర్తకీ |
| నటః (నటుడు) | నటీ |
| గౌరః (తెల్లనివాడు) | గౌరీ |
| అనడ్వాన్ (ఎద్దు) | అనడుహీ, అనడ్వాహీ |
| మత్స్యః (చేప) | మత్సీ |
| కాముకః (కాముకుడు) | కాముకీ, కాముకా |
| కబరః (అన్నిరంగులకలయిక) | కబరా |
| శోణః (ఎఱ్ఱనిది) | శోణీ |
| మృదుః (మెత్తనిది) | మృద్వీ |
| బహుః (ఎక్కువ) | బహ్వీ |
| గోపః (గొల్లవాడు) | గోపా, గోపాలునిభార్య |
| గోపాలకః (గోవులనుకాచువాడు) | గోపాలికా |
| అశ్వపాలకః [గుఱ్ఱములనుపాలించువాడు] | అశ్వపాలికా |
| సూర్యః (సూర్యుడు) | సూర్యా |
| మానుషః (మనుష్యుడు) | మానుషీ |
| ఇంద్రః (ఇంద్రుడు) | ఇంద్రాణీ |
| మాతులః (మేనమామ) | మాతులానీ |
| ఉపాధ్యాయః (ఉపాధ్యాయుడు) | ఉపాధ్యాయా |



| | |
|---|---|
| ఆచార్యః (ఆచార్యుడు) | ఆచార్యా |
| అర్యః (వైశ్యుడు, ప్రభువు) | అర్యాణీ, అర్యా |
| క్షత్రియః (క్షత్రియుడు) | క్షత్రియాణీ, క్షత్రియా |
| చంద్రముఖః (చంద్రునివంటి మోముగలవాడు) | చంద్రముఖీ, చంద్రముఖా |
| మయూరః (నెమలి) | మయూరీ |
| సుజఘనః (అందమైననడుముగలవాడు) | సుజఘనా |
| సకేశః (వెంట్రుకలతో కూడినవాడు) | సకేశా |
| అకేశః (వెంట్రుకలులేనివాడు) | అకేశా |
| సఖా (స్నేహితుడు) | సఖీ |
| హయః (గుఱ్ఱము) | హయీ |
| గవయః (అడవిగోవు) | గవయీ |
| శ్వశురః (మామగారు) | శ్వశ్రూః |
| నరః (నరుడు) | నారీ |
| యువా (యువకుడు) | యువతిః |

# వాక్యములు

## పాఠము - 33

సాధారణంగా ఒక పదానికి కేవలం అర్థాన్ని మాత్రమే చెప్పినపుడు ప్రథమా విభక్తిని ప్రయోగించాలి.

ఉదా : జ్ఞానమ్ = తెలివి, రామః = రాముడు, లతా = తీగ మొ॥

దూరంగా ఉండేవారిని పిలచేసమయంలో సంబోధన ప్రథమా విభక్తిని

వాడాలి. ఉదా : హేరామ ! = ఓరాముడా, హేరాజన్=ఓ రాజా మొ॥

ఒకదానిని గూర్చి ఉద్దేశించినపుడు ద్వితీయా విభక్తిని వాడాలి.

ఉదా : గ్రామం గచ్ఛతి = గ్రామమునుగూర్చి వెళ్లుచున్నాడు. అన్నం భక్షయతి=అన్నమునుతినుచున్నాడు, వృక్షం పోషయతి = చెట్టునుపోషించుచున్నాడు.

సూచన : తెలుగులో అయితే నగరమునకు వెళ్లుచున్నాడు. అడవికి వెళ్ళుచున్నాడు అని షష్ఠీ విభక్తి వాడుతాము. కాని సంస్కృతంలో ద్వితీయా విభక్తి వాడాలి. ఇది సంస్కృతంలో విశేషము.

కర్మణిప్రయోగంలో అయితే కర్తకు, మిగిలినచోట సాధనాన్ని తెలిపే పదానికి తృతీయ వాడాలి.

ఉదా : రామేణ రావణః హతః (రామునిచేత రావణుడు చంపబడెను. బాణేన వృక్షః పాతితః (బాణముచేత చెట్టు పడగొట్టబడినది) ఎవరి కొఱకు మనం యిస్తామో ఆ వ్యక్తి లేక వస్తువును తెలిపే పదాన్ని చతుర్థీ విభక్తిలో వాడాలి.

ఉదా: రామాయ సీతాం దదౌ (రామునికొఱకు సీతను యిచ్చెను) తెలుగులో అయితే రామునికి సీతనిచ్చెను అని అంటాము. కాని సంస్కృతంలో చతుర్థి వాడాలి.

యూపాయ దారు = స్తంభముకొఱకు కలప

నమః, స్వస్తిస్వాహా, స్వధా, అలం, వషట్ అనే పదాలు వాడినప్పుడు దానిముందు పదానికి చతుర్థిని వాడాలి.

రామాయ నమః (రామునికి నమస్కారము)

ఇంద్రాయ స్వాహా (ఇంద్రుని ఉద్దేశించి యిచ్చుట)



పితృభ్యః స్వధా (పితృదేవతలనుద్దేశించి యిచ్చుట)

దైత్యేభ్యః అలమ్హరిః=రాక్షసులను చంపుటకు హరి సమర్థుడు.

ఇంద్రాయ వషట్ (ఇంద్రుని ఉద్దేశించి హవిస్సును ఇచ్చుట)

ఒక వస్తువునుండి లేదా ఒకదానినుండి మఱియొకటి విడివడే సమయంలో విడిపడడానికి కారణమైన దానికి పంచమీ విభక్తి వస్తుంది.

ఉదా : వృక్షాత్ పర్ణం పతతి (చెట్టునుండి ఆకుపడుచున్నది)

గ్రామాత్ రామః ఆగచ్ఛతి (గ్రామమునుండి రాముడు వచ్చుచున్నాడు) సంబంధాన్ని తెలిపే సమయంలో షష్ఠీవిభక్తిని వాడాలి.

ఉదా: రాజ్ఞః పురుషః (రాజుకు చెందిన పురుషుడు)

సతాం మార్గః (సజ్జనుల యొక్క మార్గము)

సాధారణంగా ఆధారానికి సప్తమీ విభక్తి వస్తుంది.

ఉదా : కటే ఆస్తే (చాపయందు ఉన్నాడు)

స్థాల్యాం పచతి = కుండయందు వండుచున్నాడు.

# చిన్నచిన్న వాక్యముల ప్రయోగము

పాఠము - ౩౪

వర్తమానకాలము

A పఠతి=చదువుచున్నాడు

గచ్ఛతి=వెళ్ళుచున్నాడు

వికసతి=విచ్చుకొనుచున్నది. (క్రియతో)

రామః పఠతి=రాముడు చదువుచున్నాడు

కృష్ణః గచ్ఛతి = కృష్ణుడు వెళ్ళుచున్నాడు

పుష్పం వికసతి = పువ్వు విచ్చుకొనుచున్నది. (క్రియ + కర్త)

B రామః పుస్తకం పఠతి = రాముడు పుస్తకమును చదువుచున్నాడు.

కృష్ణః హస్తినాం గచ్ఛతి = కృష్ణుడు హస్తినకు వెళ్ళుచున్నాడు.

(కర్త + కర్మ + క్రియ)

* పుష్పం ప్రాతః వికసతి = పువ్వు ఉదయము విచ్చుకొనుచున్నది.
(క + కా + క్రి)

C రామః అద్య పుస్తకం పఠతి = రాముడు ఇప్పుడు పుస్తకమును చదువుచున్నాడు

కృష్ణః సంప్రతి హస్తినాం గచ్ఛతి = కృష్ణుడు ఇప్పుడు హస్తినకు వెళ్ళుచున్నాడు

పుష్పం ప్రాతః వనే వికసతి - పువ్వు ఉదయము తోటలో విచ్చుకొనుచున్నది.

(కర్త + కాలవాచకము + కర్మ X క్రియ)

E రామః అద్యమహత్ పుస్తకం పఠతి - రాముడు ఇప్పుడు గొప్ప పుస్తకమును చదువుచున్నాడు

కృష్ణః సంప్రతి శీహస్తినాం ఘ్రం గచ్ఛతి - కృష్ణుడు ఇప్పుడు హస్తినకు త్వరగా వెళ్ళుచున్నాడు.

పుష్పం ప్రాతః సుందరేవనే వికసతి - పువ్వు ఉదయము అందమైన తోటలో విచ్చుకొనుచున్నది.

(కర్తX కాలవాచకముX విశేషణముX కర్మX క్రియ)



# భూతకాల ప్రయోగములు

పాఠము - 33

అపఠత్ - చదివెను

అగచ్ఛత్ - వెళ్లెను

వ్యకసత్ - విచ్చుకొనినది. (క్రియ)

B రామః అపఠత్

కృష్ణః అగచ్ఛత్

పుష్పం వ్యకసత్ (కX క్రి)

C రామః పుస్తకం అపఠత్

కృష్ణః హస్తినాం అగచ్ఛత్

పుష్పం ప్రాతః వ్యకసత్. (కX కX క్రి)

D రామః అద్యపుస్తకం అపఠత్

కృష్ణః *పురాహస్తినాం అగచ్ఛత్ (కX కాX కX క్రి)

పుష్పం *ప్రాతః వనే వ్యకసత్. (కX కాX కX క్రి)

సూచన : భూతకాల వాక్యాలలో కాలవాచకం గతాన్ని చెప్పాలి. *లోగడ

E రామః అద్య మహత్ పుస్తకం అపఠత్ - రాముడు ఈరోజు గొప్ప పుస్తకమును చదివెను.

కృష్ణః సంప్రతి హస్తినాం శీఘ్రం అగచ్ఛత్ - కృష్ణుడు ఇప్పుడు హస్తినకు శీఘ్రముగా వెళ్లెను.

పుష్పం ప్రాతః సుందరే వనే వ్యకసత్ - పువ్వు ఉదయము సుందరమైన వనమందు వికసించెను.

(కర్తX కాలవాచకముX విశేషణముX కర్మX క్రియ)

* * * * *

# భవిష్యత్కాల ప్రయోగములు

పాఠము - 34

A పఠిష్యతి - చదువగలడు

గమిష్యతి - వెళ్ళగలడు

వికసిష్యతి - వికసింపగలదు. (క్రియ)

B రామః పఠిష్యతి - రాముడు చదువగలడు

కృష్ణః గమిష్యతి - కృష్ణుడు వెళ్ళగలడు

పుష్పం వికసిష్యతి - పువ్వు వికసింపగలదు. (క + క్రి)

C రామః పుస్తకం పఠిష్యతి - రాముడు పుస్తకమును చదువగలడు

కృష్ణః హస్తినాం గమిష్యతి - కృష్ణుడు హస్తినకు వెళ్ళగలడు

పుష్పం ప్రాతః వికసిష్యతి - పువ్వు ఉదయము వికసింపగలదు. (క + క + క్రి)

D రామః శ్వః పుస్తకం పఠిష్యతి - రాముడు రేపు పుస్తకమును చదువగలడు

కృష్ణః శ్వః హస్తినాం గమిష్యతి - కృష్ణుడు రేపు హస్తినకు వెళ్ళగలడు (క + కా + క + క్రి)

పుష్పం ప్రాతః వనే వికసిష్యతి - పువ్వు ఉదయము వనమునందు వికసింపగలదు. (క + కా + క్రి)

E రామః శ్వః మహత్ పుస్తకం పఠిష్యతి - రాముడు రేపు గొప్ప పుస్తకమును చదువగలడు



కృష్ణః శ్వః హస్తినాం శీఘ్రం గమిష్యతి - కృష్ణుడు రేపు హస్తినకు త్వరగా వెళ్ళగలడు (క + కా + కX విX క్రి)

పుష్పం ప్రాతః సుందరే వనే శనైః వికసిష్యతి - పువ్వు ఉదయము అందమైన తోటలో మెల్లగా వికసింపగలదు. (కX కాX విX క్రి)

సూచన ; విశేషణములు రెండురకములు క్రియలో విశేషాన్ని చెబితే క్రియావిశేషణము. మిగిలినవి సామాన్య విశేషణములు.

ఉదా : 1) శీఘ్రం, శనైః - క్రి. వి.
2) మహత్ - సా. వి.

# క్రియలకు భూతకాల భవిష్యత్కాల ప్రయోగములు

పాఠము - 35

క్రియలకు భూతకాలరూపములు ఏర్పడవలెనన్నచో వర్తమాన కాలరూపములను ముందు గ్రహింపుము. వానికి ముందు అకారమును చేర్చి చివరగల ఇకారమును తొలగించి పొల్లుతో ఉచ్చరించినచో భూత కాలరూపము లేర్పడును.

ఉదా : భూ - ఉండు (క్రియ)

వర్తమానకాలరూపము - భవతి

ముందు అకారమును చేర్చగా - అభవతి

చివఱగల ఇకారమును తొలగించగా - అభవత్

అభవత్ - ఉండెను.

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. పు | అభవత్ (ఉండెను) | అభవతామ్ (వారిద్దరూ ఉండిరి) | అభవన్ (వారందరూ ఉండిరి) |
| మ. పు | అభవః (నీవు ఉంటివి) | అభవతమ్ (మీరిద్దరు ఉండిరి) | అభవత (మీరందరూ ఉండిరి) |
| ఉ. పు | అభవమ్ (నేనుంటిని) | అభవావ (మేమిద్దరము ఉంటిమి) | అభవామ (మేమందరము ఉంటిమి) |

*

భవిష్యత్కాల రూపములు

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. పు | భవిష్యతి (వాడు ఉండగలడు) | భవిష్యతః (వారిద్దరూ ఉండగలరు) | భవిష్యన్తి (వారందరూ ఉండగలరు) |
| మ. పు | భవిష్యసి (నీవు ఉండగలవు) | భవిష్యథః (మీరిద్దరూ ఉండగలరు) | భవిష్యథ (మీరంతా ఉండగలరు) |
| ఉ. పు | భవిష్యామి (నేనుకాగలను) | భవిష్యావః (మేమిద్దరము ఉండగలము) | భవిష్యామః (మేమంతా ఉండగలము) |

సూచన : ఇట్లే అన్ని క్రియలకు భూతకాల, భవిష్యత్కాల రూపము లను అభ్యసింపవలయును.



# సమాస పరిచయము

## పాఠము - 26

రెండు లేక అంతకంటె ఎక్కువ పదాలు పరస్పరం అన్వయాన్ని పొంది ఒక పదంలా అవడమే సమాసం. సమాసంలోని పదాలు ఒక దానితో ఒకటి అన్వయించాలి. అర్థం రీత్యా అన్వయించకపోతే సమాసంకాదు. సమాసాలలో పదాల మధ్య విభక్తులుండవు. మొత్తం పదం చివర మాత్రమే విభక్తి ఉంటుంది. సమాసాన్ని విడగొట్టి ఆ పదాలకు విభక్తులు చేర్చి వాక్యం చెప్పవచ్చు. దీనినే విగ్రహం అంటారు. ఎక్కువ అర్థాన్ని తక్కువ పదాలతో చెప్పడం ప్రయోజనం అలాగే వర్ణనలలో ప్రతి పదానికీ విభక్తులు చెప్పకుండా సమాసాలతో వర్ణించవచ్చు.

సమాసాలలో అనేక భేదాలున్నాయి. అవి 1) తత్పురుష సమాసము 2) కర్మధారయము 3) ద్విగువు 4) బహువ్రీహి 5) అవ్యయీభావము 6) ద్వంద్వము 7) అలుక్సమాసము

### (1) తత్పురుష

దీనిలో రెండవపదానికి ప్రాధాన్యం ఉంటుంది.

ఇది ఎనిమిదివిధాలు. 1) ప్రథమా తత్పురుష 2) ద్వితీయా త. 3) తృతీయా త 4) చతుర్థీ త. 5) పంచమీ త. 6) షష్ఠీ త. 7) సప్తమీ త. 8) నఞ్ త. సమాసాన్ని విడగొట్టి విగ్రహ వాక్యం చెప్పేటప్పుడు ఏ విభక్తితో చెబితే ఆ తత్పురుష. వ్యతిరేకాన్ని తెలిపే 'న'తో చెబితే నఞ్ త.

**ఉదాహరణలు**

| | | స. | వి. వా. |
|---|---|---|---|
| 1) ప్ర. త. | A. | ఉత్తరకాయః | ఉత్తరఃకాయస్య (ఉత్తరభాగము శరీరంయొక్క) |
| | B | అర్ధపిప్పలీ | అర్ధం పిప్పల్యాః (సగము పిప్పలియొక్క) |

| | | |
|---|---|---|
| 2) ద్వి. త. | A. దుఃఖాతీతః | దుఃఖం అతీతః<br>(దుఃఖమును దాటినవాడు) |
| | B. కృష్ణశ్రితః | కృష్ణం శ్రితః<br>(కృష్ణుని ఆశ్రయించినవాడు) |
| 3) తృ. త. | A. విద్యానిపుణః | విద్యయా నిపుణః<br>(విద్యచేత నిపుణుడు) |
| | B. పితృసదృశః | పిత్రా సదృశః<br>(తండ్రితో సమానుడు) |
| 4) చ. త. | A. భూతబలిః | భూతేభ్యో బలిః<br>(ప్రాణులకు కొఱకు బలి) |
| | B. యూపదారు | యూపాయ దారు<br>(స్తంభము కొఱకు కలప) |
| 5) పం. త. | A. చోరభయమ్ | చోరాత్ భయమ్<br>(దొంగవలన భయము) |
| | B. వృక్షపతితః | వృక్షాత్ పతితః<br>(చెట్టునుండి పడినపండు) |
| 6) ష. త. | A. రాజపురుషః | రాజ్ఞః పురుషః<br>(రాజుయొక్క పురుషుడు) |
| | B. వృక్షమూలమ్ | వృక్షమూలమ్<br>(చెట్టుయొక్క మొదలు) |
| 7) స. త. | A. ఆతపశుష్కః | ఆతపే శుష్కః<br>(ఎండయందు ఎండినది) |
| | B. దానశౌండః | దానే శౌండః<br>(దానమునందు నిపుణుడు) |
| 8) న. త. | A. అజ్ఞానమ్ | న జ్ఞానమ్<br>(జ్ఞానముకానిది) |
| | B. అనశ్వః | న అశ్వః<br>(గుఱ్ఱముకానిది) |



పాఠము – 37

## (ii) కర్మధారయ సమాసము

ఇది ఏడువిధాలు. ఇదికూడ తత్పురుషలోనే చేరుతుంది. దీనిలో గూడ సాధారణంగా రెండవ పదానికే ప్రాముఖ్యం. దీనిలోగూడ అనేక భేదాలున్నాయి

| సమాసము | వి. వా. |
|---|---|
| A. నీలోత్పలాని | నీలాని చ తాని ఉత్పలాని చ<br>(నల్లనైన ఆ కలువలు) |
| B. రమ్యలతా | రమ్యా చ సా లతా<br>(అందమైన ఆ తీగ) |

## (iii) ద్విగువు

సంఖ్యముందుండే సమాసము ద్విగువు. దీనిలోగూడ భేదాలున్నాయి.

| | |
|---|---|
| A. పంచవటీ | పంచానాం వటానాం సమాహారః<br>(ఐదు మఱ్ఱిచెట్లయొక్క కలయిక) |
| B. త్రిలోకీ | త్రయాణాం లోకానాం సమాహారః<br>(మూడు లోకముల కలయిక) |

## (iv) బహువ్రీహి

దీనిలో సమాసంలోని పదాలకు గాక ఇతర పదానికి ప్రాముఖ్యం ఉంటుంది. దీనిలోగూడ భేదాలున్నాయి.

| | |
|---|---|
| A. మహాబలః | మహత్ బలం యస్య సః<br>(గొప్పబలం ఎవడికిగలదో వాడు) |

B. పీతాంబరః — పీతం అంబరం యస్య సః
(పసుపుపచ్చని వస్త్రము ఎవడికి గలదో వాడు)

### (v) అవ్యయీభావము

అవ్యయం ముందుండే సమాసమే అవ్యయీభావ సమాసము. దీనిలో కూడ భేదాలున్నాయి.

A. యథాశక్తి — శక్తిమనతిక్రమ్య
(శక్తిని మించకుండా)

### (vi) ద్వంద్వము

దీనిలో రెండు పదాలకూ ప్రాముఖ్యం ఉంటుంది. ఇక్కడగూడ రకాలున్నాయి.

A. రామకృష్ణౌ — రామశ్చ కృష్ణశ్చ
(రాముడును కృష్ణుడును)

B. ధర్మార్థకామమోక్షాః — ధర్మశ్చ అర్థశ్చ కామశ్చ మోక్షశ్చ
(ధర్మమును అర్థమును కామమును మోక్షమును)

### (vii) అలుక్సమాసము

పదాల మధ్యగల విభక్తి లోపించకుండా సమాసంలోగూడ అలాగే ఉంచే దాన్ని అలుక్సమాసం అని అంటారు.

A. కంఠేకాలః — కంఠేకాలః యస్య సః
(కంఠమునందు నలుపు ఎవనికి గలదో వాడు)

గమనిక :- సమాసాలలోగల భేదాలు నిదానంగా తెలుసుకోవచ్చు.

# అభిప్రాయాలు

"ఇంతవరకు దేవభాషగా కొన్ని తెగల భాషగా వ్యవహరించిన సంస్కృతాన్ని మీరూ నేర్చుకోండి అంటూ అందరికీ అవకాశం కల్పింప యత్నించిన ఈ రచయిత ప్రశంసార్హుడు. ఈ గ్రంథ రచయిత శ్రీ నిష్ఠల సుబ్రహ్మణ్యంగూడ సంస్కృత ప్రచారోద్యమాన్ని చేపట్టారు వీరు వ్యావహారిక తెలుగునే ఇందు వాడడం ముందుచూపుకు నిదర్శనం"

—ఈనాడు

"ఈ పుస్తకాన్ని రచించిన నిష్ఠల సుబ్రహ్మణ్యంగారు సంస్కృత భాషాప్రచారానికి దీక్షబూనిన సమర్థులు. ఈయన ఈ గ్రంథ రచనకు పూనుకోవడం ప్రశంసనీయం సులభపద్ధతిలో అందరినీ ఆకర్షించే విధంగా రచనసాగించింది. సంస్కృత భాషాప్రచారానికి రచయిత చేస్తున్న ప్రయత్నం ప్రశంసించదగినది."

—భారతి, Oct, 1986.

"ప్రపంచమంతా సంస్కృతంపైపుకు అడుగువేస్తోంది. ప్రతి వ్యక్తి సంస్కృతం తప్పక నేర్చుకోవాలని కుతూహలపడుతున్న ఈ రోజులలో సంస్కృతాంధ్ర విద్యాకోవిదులైన శ్రీ నిష్ఠల సుబ్రహ్మణ్యం గారు సంస్కృత ప్రచారోద్యమంలో ఒక భాగంగా ఈ గ్రంథాన్ని రూపొందించడం సంస్కృత జిజ్ఞాసువుల అదృష్టం. ఇందులో మాట్లాడే మెలకువలెన్నో తెలియజేయబడినాయి. ఈ పుస్తకంద్వారా సంస్కృతం నేర్చుకొని స్తోత్రాలు, పురాణాలు సు [illegible] చ్చు.

—శ్రీశైల ప్రభ.